# శ్రీ హనుమత్కల్యాణము

★

పాటూరి మధుసూదనరావు

( రూపాయి )

# శ్రీ హనుమత్కల్యాణము

రచయిత

కవి, పండిత హరిదాసహంస

పాతూరి మధుసూదనరావు

శ్రీ లలితకళా గ్రంథమాల,

భట్టిప్రోలు.

# ఆశీస్సు

శ్లో॥ ఆలోడ్య వేదశాస్త్రాణి సర్వాణ్యపి మహర్షిభిః ।
ఇదమేకం సునిర్ణీతం నదైవం హనుమత్ పరం ॥
(వానరగీత 18వ శ్లోకం)

వేదవేద్యుడైన ఆ సచ్చిదానంద పరమాత్మయే సర్వశక్తియుతుడై సమిష్టి సర్వదేవాంశ సంభూతుడై అందు ప్రధానముగ మృత్యుంజయుడై సర్వమునకు మృత్యుహరు లగుటకు శ్రీ పార్వతీ పరమేశ్వర తేజోసముద్భూతుడై సర్వక్రియాకలాప హేతుభూత ఘటన అఘటనా కార్యసాధక అనంత చైతన్యమూర్తి అగుటకు ప్రాణాంశ సంభూతుడై సర్వ తిరస్కృతి తమస్సు దగుటకు సర్వవిద్యా అవిద్యా ద్యోతకుడగుటకు అనలాంశ సంభూతుడై అంజనా కేసరుల జన్మాంతర తపఃఫలముగా శ్రీ అంజనాగర్భమందావిర్భవించి స్వస్వాత్మలచే హనుమదాది అనేక నామముల ధరించి విరాజిల్లుచున్నాడు. అట్టి పరమాత్మ అనేక రూపంబులు ధరించి అనేక లీలలు సాధించుట "అనంతరూపాణి బిభర్తి లీలయా" అను పారాశరోక్తిచే మనకు నిరూపణ మగుచున్నది. ఇట్టి పరమాత్మకు జననము, దుష్టశిక్షణ శిష్టపరిపాలనాదులు లీలలు. పరాశంసంహిత యందు,— శ్రీ హనుమత్ శ్రీరామచంద్రులయొక్క అవినాభావ సంబంధము నిర్ణయించబడియున్నది. అందు ఒకటి: 'హరి', రెండవది 'హర'. 'హరి' 'హర' శబ్దములు రెంటియందును 'హ'కార 'ర'కారములే ప్రధానాక్షరములు. అయ్యది పురుష వాచ్యమై తటస్థరూపమై ఆదిస్వరముచే సర్వవిద్యాత్మకమైన సూక్ష్మ రూపమై సర్వత్ర దుగ్ధస్థసర్పివత్ వ్యాప్తమై నిర్లిప్తమై యున్నది. రెండవది 'ర'కారము. ఇయ్యది స్వప్రకాశమై సర్వభాసక భాసమై బహిర్మధ్య వ్యాప్తమై నేత్రాది ఇంద్రియగోచరమైన సర్వము తానెయై సృష్టి స్థితి తిరోధానంబుల సలుపుచు తను షడ్వికార దూరమై యున్నది. ఇందు 'హ'కారత్మకంబైన తత్త్వంబు హనుమత్ రూపంబుననున్నూ, 'ర'కారాత్మకంబైన తత్త్వంబు 'రామ' రూపంబుననున్నూ ఆవిర్భవించి గోచరంబయ్యెం. అందులకే ఆ అవినాభావసంబంధము. అది నిరూపించుటకే శ్రీ హనుమత్

మూర్తి హృత్పద్మంబుల శ్రీ సీతారాముల నిలకడ. అది నిరూపించుటకే శ్రీరామచంద్రమూర్తి వారి హృదయాది పాదపర్యంతము శ్రీ ఆంజనేయ స్వామివారి కచ్చితమన్న అధ్యాత్మ రామాయణోక్తి. గాన శ్రీరామకథ శ్రీ హనూమత్కథకు భిన్నంగా గాని, శ్రీ హనూమత్కథ శ్రీరామకథకు భిన్నంగాగాని యుండనే యుండదు. అట్టిది మన కవిగారు శ్రీ మద్రామాయణము గానము చేసి అందులో స్వామివారిని ఉపాసించుటయే గాక, శ్రీ స్వామివారి కథయందుగూడ శ్రీరామోపాసన చేయుటకు పూనుకొనట చాల శ్రేయోదాయకము, సంతోషదాయకము.

"ధన్యోవాచఃశపివదనా రుణస్తోత్ర పూతాః కవీనాం"

"శ్రీహనుమత్స్తవరాజమ్."

అను న్యాయంచేత స్వామివారిస్తోత్రముచే వారివాక్కులే గాక ఆసాంస్వతము అందించుటచే విని అంత సద్రసగ్రహణము చేయు వారలుగూడ పునీతులు కాకపోరు. కవిగారు సారస్వతదానము చేతను అచ్చువేయించిన శ్రీ మంత్రవాది గౌరినాథశాస్త్రి గారు ద్రవ్యదానముచేతను, ఈ రచనకు తోడ్పడి వారివారి కైంకర్యములు నెరవేర్చుకొన్న వారైనారు.

శ్రీ కవిగారు ఆంధ్రదేశములో మహాకీర్తి గడించిన కవులు కథకులు ప్రవక్తలు వారి కవితా ప్రౌఢి ఆంధ్రగీర్వాణ భాషలయందుగల ప్రవీణత, దేశభక్తి, దేశనాయకులందుగల అనురక్తి వారిదేశసేవ, ఆసక్తి ఆదర్శులైన శ్రీ మహాత్మగాంధిగారి యందు వారి మార్గములయందు లక్ష్యము ఈ గ్రంథము చాటుచున్నదని చెప్పుటకు ఏమాత్రము సందేహము లేదు. వారు భాషాసేవ చేయుచు తన్మూలకముగా దేశసేవ, సద్ధర్మప్రవచనము నిశ్శంకతో ఉత్తమధర్మప్రబోధము చేయుచు చిరంజీవిగా సుఖముగ వర్ధిల్ల ఆశించుచున్నాను.

శ్రీవారి సన్నిధి
తెనాలి
వికారి సం॥ వైశాఖ బహుళ సప్తమి
గురువారం ది 29–5–59.

ఇట్లు
భాగవతుల అన్నపూర్ణయ్య.

# అంకితము

చింతలపల్లిలో (ఒరంగల్లు వద్ద) శ్రీ సువర్చ లాంజనేయస్వామిని ప్రతిష్ఠించి ఆలయమును నిర్మించి తమ పవిత్ర భక్తిహృదయమును అంకితము చేసిన శ్రీ మంత్రవాది గౌరినాథశాస్త్రిగారు ఏతద్గ్రంథ ముద్రణ వ్యయమును భరించి నా కృతికి ఆకృతి కల్పించి సువర్ణగౌరవమును ఇప్పించిరి. వారికి నా కృతజ్ఞతా పూర్వక అభివందనములు. వారి కుటుంబమునకు స్వామి అభీష్టవరప్రసాదియై ఆయురారోగ్యభాగ్యములు శాశ్వతముగ నొసఁగుఁగాక.

రచయిత

పాతూరి మధుసూదనరావు.

# శ్రీ హనుమత్కల్యాణము

## నాంది

శ్రీమంతం విభు మాంజనేయ మభవ శ్రీరూప ముద్యద్బలం
యోబ్రహ్మేంద్ర ముఖామరస్తుతిపదో భూత్వాపి మస్తాంజలిః
స్థిత్వా దాస ఇవ ప్రకాశిత వపుస్తం సర్వశక్తం కపి
శ్రేష్ఠం భవ్య సువర్చలాపతి మహం వందే సదామారుతిం.

కల్యాణి - చతు॥ త్రిపుట

ప॥ శ్రీమహిత గుణోపేతం ।
చింతయామి హృదయే హనుమంతం ॥

అ॥ కామదాన గణనీయ చరిత్రం ।
ఘన పాపలతాకులఖనిత్రం ॥శ్రీ॥

చ॥ సీతారామానంద వర్ధనం ।
శ్రీరామనామ స్మరణాధనం ॥
వీతశోక మోహ భవబంధనం ।
విశ్వనాథ తేజః సంబంధినం ॥ ॥శ్రీ॥

2. శ్రీ సువర్చలాంగనా మనోహరం ।
సేవకజన వరదాన మందారం ॥
భాసురగుణ మధుసూదన విరచిత ।
భవ్య కావ్య భావాంకిత మపరం ॥ ॥శ్రీ॥

సీ. ప్రణవ వక్రకరేఖ భవ్య ముఖుఁడు స్వామి
విఘ్నములను బాపి విజయమొసఁగ
నవ్యఘణతుల ననారత మొసఁగి మా
ర్గముచూపి వాణి గౌరవము నింప
నెల్లవేళల లోపమేలేని యర్థము
లొసఁగి మహాలక్ష్మి యొప్పుగూర్ప
ననుపమాన నిరంతరానందమును గూర్చి
హరి హరవిధి ముఖ్యు లాదరింప

తే. కరములను మోడ్చి మ్రొక్కి పత్కంజములను
వినుతు లొనరింతు తత్కృపా విలసితమయి
నాదు కావ్యము కవిజనానందకరము
గా వెలయుగాఁత! శాశ్వత ఖ్యాతిమీర.

సూత్రధార కథక వాక్యము

సీ. సకలజీవులయందు సమబుద్ధివర్తించు
శాస్త్ర రహస్య విజ్ఞానులార
ఆశ్రయించినవారి కఖిలార్థములొసంగి
కనికరించెడు కృపాకల్పులార
నిజదేశదైవ వినిశ్చలసద్భక్తి
మతులౌ సదాచార మహితులార
పరకష్ట సుఖములు భావించి సాయముఁ
గోరిచేయు పరోపకారులార

తే. హరికథాశ్రవణైకసుఖార్థులార
శాంతిసంస్థాపనైక విచారులార

సారమతులార సత్సభాస్తారులార
అందుకొనుఁడయ్య మత్కుసుమాంజలులను.

## ప్రస్తావన

పంతువరాళి - చతు । త్రిపుట

ప॥ భారతదేశము జాతీయతయన ॥
భక్తిభావమువినా వేరెకలదె ॥భా॥

అ॥ ధారుణీప్రజల కైక్యసుఖంబన ॥
దైవకృపవినా కలుగఁగలదె ॥భా॥

చ॥ భూతభౌతిక విచారములో సిరి ॥
పొలుపారిన ఫలమేమి
నీతినియమముల నిష్ఠలేనిచో ॥
నిజమనుభవించుగతియే లేమి ॥భా॥

2. కానరాని దన్నృతమనుచు నెంచిన ॥
మానవతామర్యాద యిఁకేమి
జ్ఞానసిద్ధికై మధుసూదననుత ॥
సత్యమార్గమార్షముదలఁపరేమి ॥భా॥

ఉ. ఆకలితీర నన్నమును స్వార్థసమస్య కబద్ధమార్గమున్
ప్రాకటరీతిపొందుటిది ప్రాణులకున్ సహజస్వభావ; మీ
ప్రాకుట పశ్చిమక్రియ-విపశ్చిదమోఘ తపఃక్రియా ప్రభా
వా~~త్తిక శాంతి~~మార్గ సుఖమందుఁడు భారతధర్మవీరులై.
క్తి శాంత్య

చం. రఘుపతిరాఘవ ప్రదిత రామపదం బవలంబనంబుగా
నఘురహితంబటంచును మహాత్ముఁడు గానముచేసె-తద్బల

ప్రఘటితమయ్యె భారతధరాపరిపాలనలో స్వతంత్ర-మా
మఘమె యొనర్చి శాంతిసుఖమార్గము పొందుఁడు
నేడు హైందవుల్.

తే. ఆంజనేయునిలోని యనంతరామ
భక్త్యనుభవ ప్రభావము, భవ్యకార్య
సాధనంబున దీక్ష, లక్ష్యంబుగాగ
బాపుజీ జీవితము సర్వభావ్యమయ్యె.

శ్రీరంజని – రూపకము

ప॥ భక్తిలేని హృదయములో॥ శక్తియుండఁబోదు దైవ ॥భ॥
శక్తిలేనిజీవునిలో ॥ ముక్తగతి లభింపఁబోదు ॥భ॥
మనసు లక్ష్యమును విడిచిన॥ మర్యాదయుగలుగఁబోదు
తనుదా నెఱుఁగక మధుసూ ॥ దనునిబోధ తెలియఁబోదు ॥భ॥

కళ్యాణి – ఆదితాళము

వినుఁడి మారుతి చరితము – విశ్వజనవినుతము
కనుఁడి తత్కృపవలనఁ – గామితార్థఫలము ॥వి॥
అనుపమాన బలుఁ డవనిజారాముల
తనువులైక్యముగూర్చి – తన్పిన మహితుఁడు ॥వి॥

చ॥ పుట్టు జందెమువాఁడు । ముక్కంటి సరివాఁడు
నెట్టన దొసఁగుల । నెట్టి యేలెడువాఁడు
గట్టి బత్తులతోడు । కఱకు సోకుల సూడు
బిట్టు పెరిమ మధుసూ । దన కృతిఁగొన్నాఁడు ॥వి॥

# కథా ప్రారంభము

సీ. అద్రి త్రేతాయుగం బమరాసగా తటం
బున గౌతమమహర్షి పూని యాత్మ
సతియౌ నహల్యతో సత్తపోనిష్ఠుఁడై
తనరుచుఁ దనకు నాత్మజులుగాఁగఁ
గాంచె శతానంద ఘనగుణు, నంజని
యనుకన్య - నవల నహల్యయందు
కవలలై జన్మించి ఋక్షుడన్ ప్లవఁగ నా
యకు పెంపునన్ వృద్ధినంది - రంత
తే. నొక్కతరి గౌతమర్షి స్నానోత్సుకుఁడయి
అరుగునెడ వెంటవచ్చిన యంజనియును
తద్రహస్యము తెల్పెఁ బ్రస్తావవశత
దాఁగునె రహస్యముల్ పసితనమునందు.

తోహర - చతురశ్ర

గౌతమఋషి స్నానమ్మై జపమ్మును గావించి మగిడివచ్చి
చేతమునం గోపమలమి చేడియ చేసినపని కెదనొచ్చి
మననునం జింతచెందగా నాశ్రమ శిలాతలమున నుండి
వినవచ్చె భయద రవమొక్కటి యప్రియ
వాఙ్మయమై యుండి.

తే. "ఓసి పాపిష్ఠురాల నాయొప్పు చెఱచి
నావ! అంధస్థితింబడి నీవుకూడఁ
గాంచెదవుగాక యొకకోతి గర్భజుఁడుగ"
ననుచు శపియించె నంజని యంధయయ్యె.

ఉ. జాలిమెయిసంగ మాని తనుజాతను బాష్పనిరుద్ధ నేత్రుఁడై
కేలఁగదించి "తల్లి! యిది కేవల దైవికమే మఱల్పఁగా
జాలను దల్లి శాపమును - శాంతివహింపుము! నీతనూజుఁడే
కాలము సర్వవంద్యగుణగౌరవుఁడౌనని పల్కి యాత్మలోన్

జనరంజని - చతు॥ త్రిపుట

ప॥ తప్పదయా సంసారపు తీరుల ।
త్రిప్పలయా ॥త॥

అ॥ ఎప్పుడైన తనుధారులు తమతమ ।
అప్పుతీర్చి కాలునిచేఁబడక ॥త॥

చ॥ కన్ను మూసికొని కానకయుంటే ।
కాలరథగమన మాగదయా ॥
ఎన్నఁగా కర్మఫలము గుడుచుటకు ।
చిన్న పెద్ద భేదము లేదయ్యా ॥త॥

2. పవలూ రేలూ పరిణామముతో ।
బాటలుతీరిన లోకమయా ॥
చివరకు అందఱకూ మధుసూదన ।
సేవ్యపదమె జనరంజకమయ్యా !!

వ. అంజనికి నూత్నయవ్వన మంకురించినది । అది వసంత నవమల్లికా వికాసానుకారి ।

ఉ. చక్కనిచుక్కయై ప్రకృతిసార లతా కుసుమంబునై, సుధా
భుక్కులుకూడచూడని అపూర్వరసాస్పదకల్పమై, యశో
భాక్కమనీయ కాంతిజితవారిజమై, తనుమధ్యయై, మదిన్
మక్కువనింపు సోయగపుమందిర మంజనిరూపమై తగెన్,

చ. వెలగల జాతిరత్నములు, విచ్చినపూవులు మించుతీవలున్
గలిపిన మేలిబంగరు వికాసము పాకముచేసి, తద్రసం
బులకు సుగంధపుంబొడులుపూనిచి బ్రహ్మగఁబోఁత వోసియా
నలువసృజించె దీని—మది నంటిన మక్కువయెక్కునైతగన్.

వ. గౌతమమహర్షి అంజనికి వివాహము చేయ నిశ్చయించు
కొనెను । ఆమె అంధత్వముతో విరాగిణియై తండ్రితో

ఉ. కన్నులుకల్గిలోకమునుగాంచుచు మోహమునన్ జరించు నా
బన్నము తప్పఁద్రోసెనుకృపామయియై ననుఁగన్నతల్లి—నన్
గన్నులు లేనిదానిగను గల్పనఁజేసె నిఁకన్ దమస్సులోఁ
గన్నులపండగయ్యెడు వికాసముఁగోరి తపంబొనర్చెదన్.

తే. పోయినదియేమొ బంధము పోయెనింక
వలదు భవసంగతి యిఁకఁ దపంబొనర్తు
జన్మకర్మలు లేకుండ నల్పుకొందు
పెండ్లినాకేల ? ఆకోతి బిడ్డయేల ?

వ. అంజనియొక్క విరాగము గ్రహించి ఆందోళనముచెందిన
మనస్సుతో గౌతమ మహర్షి ఆమెను వివాహితనుగా
చేయుటకు సంకల్పించి

భైరవి — ఆది

ప॥ వయసున కుచితమ్మగు మార్గమ్మున ॥
బరగి ధర్మగతి సాధింప నగును ॥వ॥

అ॥ప॥ భయములోన నభయమ్ము గ్రహించి
పరమ పురుషార్థమును బొందననగును ॥వ॥

చ॥ అనునిమేష మగ్ని పరీక్షవలెనె
అనుపమాన జీవితముఁ గనవలెను
మనసులోన నియమము లెడసేయక
మధుసూదన సమ్మత మెఱుఁగవలెను ॥వ॥

చం. అనుభవముల్ గ్రహించి జగదభ్యుదయక్రియలాచరించు స
జ్జనులువచించుమార్గమున సాగి, పవిత్రముగాఁగ జీవితం
బును సరిదిద్ది, నిష్కలుషబుద్ధి యథార్థము లెంచి,సత్యమా
ర్గనిరతి శాంతినందుటయె కర్జము తల్లి ! భవాబ్ధిదాటఁగన్.

వ. కావున నీవు వివాహంబాడి ఇహపరసుఖంబులకు మార్గ
దర్శకంబుగా నీజీవితము పవిత్రముచేసుకొనుమని ఎన్నో
విధముల నచ్చబల్కఁగా అంజనియు ఎట్టకేలకు సమ్మ
తించెను । కాని యెవ్వరును అంధబాలాపాణిగ్రహణము
నకు అంగీకరించలేదు.

బ్రహ్మయొక్క కుమారుఁడు కేసరియను వానరనాయ
కుఁడు అంజని వృత్తాంతము విని "ఇట్టి సత్యశీలయూ తప
స్వినియూ అయిన అంజని భార్యయగుటకన్న భాగ్య
మేమిటి?" అని భావించి పాణిగ్రహణమున కంగీకరించెను।
వివాహము సకలమునిసురగణ సంభావ్యముగా జరిగెను.
అంజని నిజనాథుఁడైన కేసరితో

మాయామాళవగౌళ — రూపకము

ప॥ తపముచేసి నాజన్మకు ॥ ధన్యతచేకూర్చుకొందు
విపరీతభవంబువాసి ॥ విశ్వమయునిఁ గనుగొందు ॥త॥

చ॥ పుట్టిపెరుగుచుండెడి తనువులోన ॥ పుణ్యసారమేమొకొందు
వట్టిమోహమునువిడిచి ॥ వాంఛిత మీడేర్చుకొందు ॥త॥
2. జన్మకర్మ గతులులేని ॥ సత్యమేమొ తెలిసికొందు
చిన్మయమూర్తినిఁగనుగొని ॥ చిరసౌఖ్యముననుభవింతు॥త॥

తే. అనుచు దీనయగుచుఁ దన కంజలించు
నంజనింగని కేసరి యనుమతించె
ఆపెకుం దండ్రిబోధించె ననిలశక్తి
తీవ్రతప మొనరుసనాపె దీక్షఁబూని

వ. వాయుదేవుని తనమదిలో లక్ష్యంబుచేసి విషయవినివర్తిత
చిత్తమున

సావేరి — చతు ॥ త్రిపుట — (అనా 3 అక్ష)

ప॥ నిన్నే నమ్ముకొన్నానుమది స్వామి ॥
నీకన్న అన్యదైవమెవరులేమి ॥ని॥
అ॥ప॥ పన్నుగాను జీవరూపములలోన ॥
ప్రాణాత్మునై వెలసితివిగాన ॥ని॥
చ॥ నామీద నెనరుంచిబ్రోతువని ॥
నాబ్రతుకు నీచేతనున్నదని
క్షేమదాతవని సిద్ధరూపుఁడవని ॥
శ్రీమధుసూదన గేయుఁడవని ॥ని॥

సీ. సకలమునీంద్ర సంస్తవనీయచారిత్ర
సంతత జీవవిశ్వాసపాత్ర
అఖిలలోకాధార అనుపమామరవీర
హతపాపభార సంభృతశరీర

సర్వాత్మరూప ప్రశమితదుర్గదతాప
దూరితకోప విధూతశాప
గంధవాహాభవగంధభూజవిదాహ
దారితమోహావిస్తారితోహ

తే. అఖిల సూత్రాత్మరూప ! నిరంతరాత్మ
బలసురక్షితభువన ! దుర్బల శరణ్య !
నిజ జనావన గుణగణ్య ! నిగమమాన్య .
భవ్యభావనమో౽స్తుతే వాయుదేవ.

తే. అనుచుఁ గడుభక్తిఁ బ్రార్థించునంతలోన
ననిల సంప్రేరితంబయి యపుడె పడియె
చిత్రగతి నామలకమొండు చిత్తమలర
నంజనీకరకమల పుటాంతరమున.

వ. ఆమెయు నద్భుతముగ భావించి ఆ యుసిరికపండు దేవ ప్రసాదంబుగ నారగించి, మనస్సున మిక్కిలి విశ్వసించి నిరంతరముగ ననిలారాధనము చేయుచుండ తద్భర్తయైన కేసరియు నియమంబొప్పఁగ "ఓ వాయుదేవా అంజని ననుగ్రహించి మా పేరునిల్పు యశశ్శాలి నొక్కకొడుకును ప్రసాదింపుమని తపింప నారంభించెను । వాయుదేవుఁడును అంజనికి జీవనభృతికై అపుడపుడు ఫల పర్ణ పానీయంబులు ప్రసాదించుచుఁ గొండొకకాలమున

తే. ఆమెసౌందర్యమున కాత్మ నలరి యనిలు
డోర ! "ఈయందమంతయు నడవిఁగాయు

వెన్నెలదెూ యూనె!, ఈతీవ విశ్వభస్వ్య
మయ్యునుం ద్రాకుశేనట్టి గానె! అహాహ!

వ. అనుచు మదిలోభావించి

తోహార - ఆది

వలపు నిలుపనోపక దరిఁజని యయ్యెలనాగను మదిఁగోరి
చలువగలుగు నీరజపరాగములు చల్లి తమకమ్ము మీఱి
ఒకపరి మెల్లనఁ బరిభ్రమించుచు నొకసారి విజృంభించి
సకలకళాకోవిదుఁడై చరింపఁ జానయు మది శంకించి.

సీ. ఎవ్వరో నాపైట నిటులాగుచున్నట్టు
లున్న దిదేమని యొడిసిపట్టు
స్తనవల్కలమ్ము బంధనము జారెనిదేమి
యని ముడివైవ జతనముసేయు
ముద్దువెట్టు నెవండో పోల్చనైతిని జేతి
కందఁడేమని కోప మభినయించుఁ
గౌగలించు నెవండు గడుసుఁదన మిదేమి
వలదుపొమ్మంచు నవ్వులకుఁ బెనఁగు

తే. పవనుఁడుగ నెంచి "స్వామి! నా బ్రతుకు నేమి
చేయఁదలఁచితి వీపని చీకునైన
నాయెడనె" యంచు నేమియుఁ జేయలేక
అలసటలుమీఱ నంజని యంజలించె.

శా. స్వామీ సర్వమునుజ్జగించి తపముంజల్పన్ బ్రయత్నించు న
న్నేమో లోకములోనదింపితివి-నేనేమందు? నంధాంగనా

క్షేమం బీగతిఁ జూచినావు! గతియొక్కింతేనియున్ లేని నా
కేమై యెట్లగునో కదా! కరుణరక్షింపం దలంపూనుమా.

వ. అనుచుఁ బ్రార్థించుచున్నంత

తోహర - చతురశ్ర

కైలాసంబున గౌరీశ్వరులకుఁ గలిగె నొకవింత తలఁపు
భూలోకమునఁ జరించుటకపుడే పొలుపారెనుమది వలపు
తిరిగి వెంకటాచలవనసీమల వరలు కేసరి మిథునము
స్మరకేళి గూడుటంగని యపు డాసరణిఁగోరి తన్మనము
వారుం గేసరులై కవగూడఁగ వచ్చియటకుఁ బవనుండు
భూరిమహితశివతేజముఁగొనిచని పొలఁతికిడెఁగృపాధనుఁడు

వ. అంజని గర్భవతియైనది। క్రమముగా నెలలువచ్చినకొలఁది

చం. నడకలుమందమయ్యె రుచినాలుకకున్ వెగటయ్యెమాటికిన్
బడలికనూర్పులయ్యె నిజభావములోన విరాగమయ్యె మే
జడతయు స్పష్టమయ్యె, నిముసమ్మునినిద్దఱఁ దూగుటయ్యె—నే
ర్పడె జఠరాభివృద్ధియును, భామినిగర్భిణియై నెలల్ చనన్.

వ. తాను తపస్వినియై గర్భిణియగుటకు భయముచెంది తనలో

చం. పెనిమిటియెవ్వ రీమెకెటు బిడ్డజనించెనటంచు నన్ను నే
మనుకొనునో ప్రపంచ-మితఁడందఱకుంగనరానివాఁడు నా
పెనిమిటి - అమ్మశాపమున బిడ్డయు మర్కటమైన నింకనే
మనవలె నాదుకర్మ మకటా! విధి తప్పదికేమిసేయుదున్.

ఉ. పుట్టుకెదోష మాడుదయి భామిని - నట్లడగారకుండ నా
డట్టులఁ దల్లి దోషముల నాడఁగనేల? నదేఫలించె - నే

నట్టులఁ బంతగించి బ్రతుకారడిగా నిటుచేయనేల ? నీ
పట్టున దిక్కులేక తలవంపున నేడ్చుటకా పరాత్పరా !

వ. ఇట్లు తనమనమ్మున మిక్కిలివగచి నెలలునిండి ప్రసవవేదనా
దూయమాన మానసయై శంకరుని కైలాసపతిని మదినెంచి

తే. హరహరా! యేమిగతియంచు నడలుచెందు
నాపె కప్పుడు హరుఁడె ప్రత్యక్షమయ్యె
సంతసము నాపుకొనలేని సాధ్వి బాష్ప
జలముతోఁ జేసె శంకర చరణపూజ.

వ. ఇష్టదేవప్రత్యక్షసమయములో ఆమెకు అంధత్వము లేదు ।
పరమేశ్వర దర్శనానంద పరవశయై

అ ఠా ణ — ఆదితాళము

ప॥ దేవదేవ మహానుభావ సో
మావతంస కరుణాస్వభావ ॥దే॥
దేవరాజవందిత పద ప్రమహాప్ర
భావదివ్యవిగ్రహా సుజనపరిగ్రహా ॥దే॥

మి॥ కేవలానందమయమూర్తీ ॥
కిల్బిషవనదావపావకీర్తీ
జీవలోక హృదయాంతర్వర్తీ ॥
శ్రీవిలసిత భువన చక్రవర్తీ ॥దే॥

చ॥ సురతరంగిణీవిలసితమౌళీ ॥ పరిణమిత భువనపాలన కేళీ
నిరతప్రమథజనవినుతశీలీ ॥ నిత్యార్ధశరీరవిధృతకాళీ ॥దే॥

మి॥ కరధృతశూలీ కపాలమాలీ ॥
కల్పితానేకభువనపాలీ
వరగంగాధర వందేతావక ॥
చరణం మధుసూదనకవిశరణం ॥దే॥

చం. జయజయ యంచుసన్నుతులుసల్పెడునంజనినామ హాశుఁడ
ద్వ్యయుఁ డభయంబువల్క జలదప్రతిమానశుభస్వనంబునన్
"జయమగునమ్మ రామపద సంస్మరణమ్మునొనర్పుమమ్మ! అ
వ్యయహరిభక్తిభవ్యబలుఁ డాత్మజుఁడౌనని దూరమైచనెన్.

తే. అంజని యపుడు "శ్రీరామ" యని స్మరించు
నంత వినఁబడె గర్భార్భ కామితమధు
రాక్షరయుతో క్తి శ్రవణపేయమ్ముగా, న
మానుషమ్ము నసామాన్యమైన గతిగ.

కన్నడ - ఆది

ప॥ నాహమద్య బహిరాయామి ।
నవినావరణేన ప్రభవామి ॥

అ॥ప॥ ఈహామవేహిమాతః ।
సోఽహం దిగంబరః శంకరః ॥

చ॥ దేహిముదా ఆభరణం మహ్యం
మోహారహితనాగాభరణోహం
ఐహికాభీష్ట సుఖదాతాహం
అభవోపిభవంయామివిధేయః ॥నా॥

(తా) ఓ తల్లీ! నా కోర్కెను తెలిపికొనుము! నేను వస్త్రము
ధరించకుండ జన్మించను । నేను ఆశంకరుఁడను । నాకు

సంతోషముగా ఒక ఆభరణము నిమ్ము ! । (పూర్వము) నేను మోహము లేనివాఁడను । పాములను ధరించిన శివుఁడను । ఈ లోకములో కోరిన కోర్కెల నిచ్చుచుందును । నేను పుట్టుక లేనివాఁడనైనను ప్రపంచమునఁ బ్రవేశింపఁ బోవుచున్నాను.

తే. ఆ నుడులు విని యంజని యమితభీతి,
యద్భుతము తోఁచి కర్తవ్యమరయలేక
మున్ను కైలాసవిభుమాటఁ బోల్చుకొనుచుఁ
నయిదుపదిచేసి యనె నిట్లు హరునిఁగూర్చి.

చం. తెలియనిదాన నంధగతి దిక్కెను మ్రొక్కెను లేనిదాన-నీ
తెలియనిదేమిలే దిటు మదిన్ నను నెంచి పరీక్ష చేసినన్
నిలువఁగనోప-స్వామి! కరుణింపుము నీకు ననర్ఘ భూషణ
మ్ములో మఱి యంబరాలో కయి మోడ్పు లెగాక
మత్తే మొసంగుదున్.

తే. నీవు గజచర్మ ధారివి నీకుఁ దృప్తి
గలుగ నేయంబరమ్ములు కలవు దేవ !
నీవు శశిధరమూర్తివి నీకు తృప్తి
కలుగ నేభూషణమ్ములు కలవు దేవ.

కం. అడిగిన నోడఁ బడి యిడు నీ
వడుగుటకిటు గడఁ గెదువుపు లడుగఁగఁ దగునే
యుడుపతి జడముడిఁ దొడిగిన
కడదెస రొుడయుఁడవు వడిగఁ గనఁబడుము దయన్.

తే. "కన్నతల్లిఁ బ్రసవవేళఁ గష్టపెట్టి
పుట్టెనని లోకమున వాడు పుట్టకుండ
భవభయమువాపు సద్గుణాస్పదుఁడవీవు
వేగ జన్మింపుమయ్య యో విశ్వనాథ"

వ. ఇట్లు ప్రార్థించి అంజనీదేవి శ్రీరామనామము చేయుచుండ

త్రిశ్రగతి – (రూపకము)

సమస్తలోకపావన ప్రశాంత శీతవాయువుల్
శ్రమాపనోదరీతివీఁచె – స్వర్గవాసులెల్లఁబున్
సుమాళివర్షముల్ వెలార్చి సూక్తులన్ వచించి-రా
శ్రమంబులందు వెల్గె శ్రౌత సత్క్రియాకలాపముల్.

ఆ.వె. మాతృదేవి కోర్కె మన్నించి సత్కృపా
మహితుఁ డుదయమయ్యె సహజసూత్ర
కర్ణకుండలములు కౌపీనము ధరించి
రామనామసంస్మరణము మీర.

ఉ. మానుగ నవ్వసంత మధుమాసమునంజను కృష్ణపక్షమం
దైన పవిత్రమౌ దశమినాడు శనిన్ గటకాంశయుక్త కుం
భానఁ బదార్క్షమందు శుభబంధుర కుండినగోత్రమందు స
న్మానితమౌ ముహూర్తమున మారుతి జన్మమునందె
మూర్తియై.

వ. శ్రీమన్మారుతి జన్మించినట్లు సప్తఋషులు తెలిసి వచ్చి
చూచి తమలో

సీ. వదన రదనరేఖ బహువిధ పాండిత్య
బంధురుఁడను రీతిఁ బరగఁ దెల్పఁ

గరరేఖ దుష్టశిక్షణమును శిష్టాభ
యప్రద శక్తిశౌర్యములు దెల్పు
నితని యనామిక నెసఁగు చక్రనిరేఖ
యుంగరము ధరించు నొప్పుదెల్పుఁ
జరణాబ్జగత రేఖ సాగరలంఘన
సంగ్రామ విజయ ప్రశస్తిఁ దెల్పు

తే. అద్దిరా! యీమహోదయుఁ డాత్మభక్త
వరదుఁ డన్నట్లు దోఁచును బద్మభవుఁడొ
ఆదినారాయణుండొ! శశాంకధరుఁడొ
అంజనీగర్భ భవుఁడయి యవతరించె.

కాఫీ - చతురశ్రగతి

ప॥ సామాన్యుఁడే ।
సర్వబలుఁడు తేజోజితానలుఁడు ॥సా॥
క్షేమకరుఁడు కపివరతనుధరుఁడు ।
క్షితిలో నితనికి నెనమును గానము ॥సా॥

చ॥ ఈ మహితాత్మునిఁ గని మనములను ము
నీశులైనను సురేశులైన జయ
మని వినతుల నొనరింపఁదగిన ఘన
గుణయుతుఁడును హరిభజనరతుఁ డితఁడు ॥సా॥

వ. సప్తఋషులు తమ మనంబుల నెంతయుఁ గొనియాడి అంజనీదేవిం గాంచి

ఉ. అమ్మ భవత్కుమారుఁడు సమస్తచరాచరవందనీయుఁడౌఁ
జుమ్మి! కనాంజనేయుఁడనుచున్ జనులెల్లఱుఁ బిల్వనైవతే

జమ్మును వైష్ణవమ్ము విలసద్గతి నైక్యముగా నెలుంగ వి
శ్వమ్మును బ్రోచువాఁడగు నవారితశక్తి నెసంగి అంజనీ!

వ. అనుచుఁ బలువిధంబుల నాపె యదృష్టఫలము నుగ్గడించి యాంజనేయునకు నమస్కరించి తమ్ముతో వంజనిరి। అంజనీ దేవియు తనపుత్రుఁడు మానవరూపుఁడో మాతృశాపంబున మర్కటరూపుఁ డయ్యెనో ? యను సంశయముతో

చం. తలఁ జెయి వెట్టిచూచి మదిధైర్యము చెందెను-గర్ణకుండలం
బులుగని యద్భుతంపడెను - బోలిచె మూతినిబట్టి కోతిఁగా
నులికెను - జన్నిదంబుగని యుబ్బెఁ గటింగల దట్టినానుచుం
బొలుపు వహించె - వెన్కఁగల పుచ్ఛము నెంచి
విచార మేర్పడన్.

తోహర - చతురశ్రగతి

ఏమిసేతు భగవంతుఁ డిటుచేసె నేమందును నాగతికి
నేమైనం బుత్రప్రేమకు వంకేమిటి ప్రేమయె యతికి
కోతిగాని నరజాతిగాని నాకున్ జన్మించినవీఁడు
భూతలమున దీర్ఘాయుర్బలుఁడై పోలుచుతన్ బిల్లవాఁడు.

వ. ఇట్లు అంజనీదేవి తనపుత్రుని దీవించి ప్రేమించి అభ్యుదయ మాశించి పోషించుచుండ అయిదు రోజులు గడిచి తెల్లవారఁబోవు సమయమున ఆంజనేయస్వామి తల్లితో ఆశ్చర్యముగా

## సూర్యగ్రహణము

కందార్థము॥ అమ్మరో ఆకలియగు నా
కిమ్మగ నేభక్ష్యమైన నిపుడీవలయున్

ము మ్మాటి కోర్కెఁజాలను
జుమ్మా తడవయ్యె నన్నుఁ జూడవిదేలా
నమ్మను సంశయమ్మిదియేలా
నెమ్మి నేదోయింత నీవాసంగఁదలంప
కమ్మా యేమందు నాకిమ్ము దీవనచాలు

మి॥ నెమ్మనమున కభీష్టమైన ఫ
లమ్ముఁగొని సమ్మతి చరించెద
నిమ్మెఱిఁగి మధుసూదనుఁడు సా
క్ష్యముగా నిను మదినుతించెద ॥నూడవిదేలా॥

వ. ఇట్లు అయిదురోజుల పిల్లవాడు మాటలాడుటయూ తా నెత్తుకొనలేనంత భారముగ నుండుటయూ వింతగఁ దోచి పిల్లవానిని ప్రక్కనే పరుండఁబెట్టి అంజనీదేవి తనలో

చం. ఐదుదినంబులే గడిచె నర్భకుఁడేమి యిటాడు టేమి! యే దోదయకల్గి యేమిపనికో యిటులుద్భవమయ్యె-లోకమ ర్యాదనుగోరి "అమ్మ"యనియాడు టెగాని మఱేమిలేదు-తా నేదయఁజూచి తెచ్చుకొనునేదియొతోఁచినదిష్టపూర్తిగాన్

వ. అయినను చీకునైన నేను చేయఁదగిన దేమున్నదని చింతిల్లుచుఁ గుమారునితో

శహన – రూపకము

ప॥ అడిగినది యొసంగలేని ॥ అసమర్థశరీరనయితి
కొడుకా బాలెంతను నీ ॥ కోర్కె నెటులఁ జెల్లింతును ॥అ॥

చ॥ అమ్మా ఆకలియనగా ॥ అయ్యో లేదనవలసె
ఇమ్మహిలోఁ దల్లిప్రేమ ॥ నెడసిబ్రతుకఁగావలసె ॥నడిగి॥

ఉ. చేతులుచాచి స్వామిదయచేసెనదే భుజియించి మించి ని
న్నీతరిఁ బుత్రుఁగాఁబడసి యెట్టులొజీవముదాల్చియుంటి"న
మ్మాతినఁ బెట్టుమన్నఁదనయా!యిటురమ్మ"నిముద్దుగొంచునీ
చేతను బెట్టు పుష్టిదయ చేయఁడు బ్రహ్మ యిఁకేమిసేయుదున్.

తే. "వలసినది నాయనా త్రుున్ని వారకముగ
బడయుము చిరాయువై" యని బల్కెఁ దల్లి
అడవియెల్ల నపుడు కలయంగఁజూచి
యాకసము చూచె నమ్మరుదాత్మజుండు.

తే. అప్పుడగపడెఁ గల్ప ఫలాకృతిఁ డయి
ప్రాగ్దిశాభాగమున బాలభానుఁ డచట
దృష్టినిల్పెఁ బవనజుఁడు – దివ్యులకును
దివ్యదృష్టియెగాకానె దీనదృష్టి.

తోహర – చతురశ్రగతి

అపుడు నూతన త్రివిక్రమక్రమ మమర శరీరముఁబెంచి
అపరిమిత వ్యాప్తస్వరూపుఁడై, యంతంతైధృతి మించి
వియచ్చరులు వెఱగంది వార వినువీథిఁ దననేనునింపి
రయమునఁ దనదారి నడ్డమగు నభ్ర తారల నవలకంపి

శ్రీరాగము –

ప. బాలభాను బింబముఁ గని ఫలమని
చాల గగనమున కెగసి మొగిసి యొక
లీలఁ డాసి కరము చాచి గైకొని
బాలానిలజుఁడు వదనమును దెఱచి.

చాల-లోకములు చీకటుల । మూలు-దిక్పతులనెఱచి చను
లీల-సకలభువనములు క । ల్లోల-ముల నెలయ (గహణగతి

మి॥ చలింపకయె కోరల నిఱికించి స ।
ఫలీకృత మనోరథుఁడై, మిగుల
వెలిఁగె విలయకాల కాలునిపగిది ।
బాలవీరపరిబృఢుఁడు దృఢతనుఁడు
( వినుఁ డీ బాలాంజనేయుని - చరితము
విమల గుణయుతము । నవరసభరితము ॥విను॥

వ. బాలాంజనేయుఁడు ఉదయభాస్కరుని ఫలంబుగా భ్రమించి తలనోట నిఱికించి యున్న సమయమున

తే. అద్దియమవసదినము కాలానుసరణి
రాహువు గ్రసింపఁగా వచ్చె రవినిఁ - గాని
మారుతిగ్రస్తుఁడై యుంట మదినెఱింగి
ప్రాగ్దిశానాథుపాలికిఁ బర్వువెట్టె.

వ. సవినయముగ నమస్కరించి దీనుఁడై

ఉ. వందనమో బిడౌజ! పరిపంథితరగ్రకుతారతేజ ! సం
బంధజనావన ప్రకట భవ్యయశోధనభాజ ! నిత్యసా
నందశచీహృదుత్పల వనస్థిరతోషదరాజ ! స్వర్ణస
న్మందిర దేవరాజ ! సురమానవ పూజిత మాధవాగ్రజా!

తోహార - చతురశ్ర

ఏమందును శాఖామృగమొక్కటి యినబింబమ్మును మ్రింగి
ఏ మెఱుఁగనట్లు కూర్చున్నది జగమెంచకొక్కగిరిభంగి

భూనభోంతరాళములు వ్యాపించి పొలుచుశాఖామృగంబు
నీనవో(గభీమరాయుధ మనుసంధింప కాగదు నిజంబు

వ. అనుచు రాహువు విన్నవింప నింద్రుఁడును

సీ. కాలచోరుఁడు నల్లఁగా లోకములపైన
ముసుఁగు గప్పినపోల్కి మొగిసెనిరులు
అంధకారము జగ మావరించుటచేత
పడయుండె నిద్రలోఁ బ్రాణికోటి
కాలానుకూల సత్కర్మలులోపించి
యాకలితో పోలె నమర వితతి
దిక్కులకుం గుర్తు తెలియని పాంధులు
తప్పుదారులఁబడి తల్లడిలిరి
తే. కుక్కురనకుండ పక్షులు గూటనక్కె
అవనియెల్లను భానూదయంబులేక
జ్ఞానహీనహృదయ మట్లు జడతమించె
లోకమే క్రుంగిపోయి యలోకమయ్యె.

వ. అనుకొనుచు నింద్రుఁడు మినుకుమినుకుమనుచున్న భాస్కరుని జాడఁ బొడగట్టి యచ్చోటికిం జని చూచి ముఖలగ్న భాస్కరుండై యథాపూర్వ సుఖాస్కారుఁడుగ నున్న మారుతింగని

బిలహరి - ఆదితాళము

ప॥ ఔరా యొకకోతికతంబున నిటు ।
లయ్యె జగం బంధకారమయం ॥బ॥
అ॥ప॥ ఈరీతిన్ భాస్కరున కుపరాగ ।
మేలచేసె నీతని మదమూడ్చెద ॥న॥

మి॥ వారిజాసనుని సృష్టికెట్టు లే -
క్రూరుఁడు కనుగానక లయ మెంచె - న
పారశక్త వజ్రాయుధుఁడు లోక ।
పాలకుఁ డున్నాడని యోచింపఁడ ॥ఓ॥

వ. అనుచు మరుదాత్మజునిఁ గాంచి కోపోద్దీపితముఖుఁడై

శా. ఓరీయెవ్వఁడవీవు దొంగగతి నేమో మానముందాల్చి, దు
ర్వారాస్త్రౌక పరాక్రమక్రమ సుపర్వస్వామి నన్ జూడ కీ
ఘోరంబుం బొనరించినావు భళి! నీకుంగల్గు నామీఁదవి
ప్రారంభంబడగించుఁ జూడుమిదె దుర్మార్గక్రియాలోలుపా.

కం. అనుచుం దీవ్రాటోపం
బునఁ గులిశాయుధము విడిచెఁ బురుహూతుఁడు - త
ద్ఘనతర వేగజనిత ని
స్వనము భువనభాండములకు భయమును గూర్పన్.

తే. ( ఆయుధబలమ్మునే నమ్మె నమరవిభుఁడు
రామనామబలము నమ్మె రామదాసు
ఎవ్వరెక్కువ యనుమాట నెవ్వఁడెఱుఁగు
జయము గుర్తించికాదె నిర్ణయముసేఁత. )

వ. అగ్నులను జిమ్ముచు తనపైఁబడ వచ్చు వజ్రాయుధమును
గని ఆంజనేయుఁడు నిర్వికారుఁడై మనంబున

భాగేశ్వరి - త్రిశ్రగతి

శ్రీరామ రామ రామ । సిద్ధజన మనోభిరామ
శ్రీరమాప్రియధామ । శ్రీకరసుగుణోద్దామ ॥శ్రీ॥

వారిజ తులసీదామ । వరముని సుర నుతనామ
సారదయాగుణసీమ । సకలలోక సార్వభౌమ ॥శ్రీ॥

భావమందిర నివాస । భక్తజనావన విలాస
కేవలానందరాస । సేవక మధుసూదన పోష ॥శ్రీ॥

తే. అనుచు హరి నెంచి యొకరోమ మభిముఖముగ
ఛింది ఛింది యనుచును వచించి విడిచె
అయ్యది మహాస్త్రమైవచ్చి యమరనాథ
కులిశగతి మాపి వెల్గె నకుంఠశక్తి.

వ. ఇట్లు నిస్తేజమైపోయిన తనవజ్రాయుధంబును జూచి పాక శాసనుఁడు భయంబుగదురగా వెనుదిరిగి పోవుచూ

హిం - భైరవి - త్రిశ్రగతి

కోతికాదుబాబో నా । కొంపతీసె నిది యబ్బో
పోతరించు దీనిదెబ్బ । బొబ్బలుపెట్టించు నబ్బ ! ॥కో॥
తిరుగులేని యాయుధము । మెఱుఁగువాసెనీవిధము
పగర దీని దొకరోమము । బాధించెను నాప్రాణము ॥కో॥
పొరపాటునదిగితి యిట్లు । పోరుసాధ్యమనుకొంటి
ఎఱుగక చేసినపనికి । నీమాత్రము బ్రతికియుంటి ॥కో॥

వ. ఇట్లు వందురుచూ సత్యలోకమున కేగి చతుర్ముఖునికి నమస్కరించి కుశలప్రశ్నములకుఁ బ్రత్యుత్తరముగా దీనుఁడై జరిగిన దంతయు విన్నవించి వినమితాననుఁడై యుండ బ్రహ్మయు

ఉ. అందఱి నొక్కటీరునసె యాదరభావముతో సృజించితిన్
గొందఱహం మమత్వములసం భటులై తలలెత్తి లోకసం

బంధవినాశకర్మమును బాపముగాఁ దలపోయ-రక్తి గ
ర్వాంధగదప్రపూర్ణులకు నౌషధ మెన్నఁగ దండశిక్షయే.

వ. అనుచు మరుత్సుతునకు ధైర్యంబుపలికి యతనిం గనికరించి వెను వెంటవచ్చి శ్రీమారుతిని జూచి

చం. ఘనుఁడితఁడౌనె! వీనికొఱకా పనిమానుట-కొండ్రవ్రేయ
ల్కనుగనినట్లు కోతిగతి కానక యిట్టు లొనర్ప దేవతా
గణము ప్రతిక్రియన్ నెఱపఁగాఁ దలపూనెన! సిగ్గుచేటు ఛీ!
అనలము మ్రింగె ఝిల్లిక ఫలానుభవంబు మతిన్ మరల్పదే.

వ. ఇట్లు పలికి బ్రహ్మ కర్తవ్యము నిర్లక్ష్యముగా నున్న విధము గని మహేంద్రుఁడు సృష్టికర్తతో ఓ తాతా !

తోహర – చతురశ్రగతి

కానరాని మొనగాఁడు పూనగతిఁ బూనియున్నాడు కాని
కానకతని దరిజేర నప్పడము కరణి నమలు కసిఁబూని
అడుగొ భానుఁ డాతనికోరలలో నణఁగి మెఱయుచున్నాడు
కడఁగి వీని పనిఁబట్టింపకున్న పుడమికెల్లనగుఁ గీడు

వ. బ్రహ్మదేవుఁ డీమాటలువిని ఆంజనేయుని అచంచలగతిని గని

కం. "ఏమేతిమ్మా !" అనెవిధి
యేమీ మాటాడఁడయ్యె నినభోక్తయు – "నీ
యామి నడంచెద" ననెవిధి
"రామా" యని పూనమూనె రామభటుండున్.

వ. చతుర్ముఖుఁడు ఆంజనేయుని నిర్లక్ష్యతనుగని పద్మాసనుఁడాగ్రహ మున బ్రహ్మాస్త్రంబుఁ బ్రయోగింప

### తోహర – చతురశ్రగతి

విలయాగ్ని జ్వాలాభీలమ్మై వియత్తల మాక్రమించి
అలఘురవాకీర్ణంబై యా బ్రహ్మాస్త్రంబు విజృంభించి
పైఁబడవచ్చుటఁ గని తానచల బ్రహ్మాగతి శాంతిమయుఁడై
ప్రాఁబల్కు మ్రొక్కుబడిగొను నాత్మారామునుతించె
వినయుఁడై.

### చతురశ్రగతి

పాహిపరాత్పర రామవిభో తవనామవదామి పరేశవిభో
ఏహిచరాచర రూప నతామర వైరిగణం జహిలోకవిభో
సంతత సత్యపరాక్రమ జీవన దానవరేణ్యా విముక్తవిభో
సంతజనప్రియ శ్రీనిలయ శ్రితపక్షదురాత్మక శిక్షవిభో
భూతగుణ ప్రకటాఖిలలోక విలాస కళామయమూర్తివిభో
జాతకగమ్య అగమ్య గుణాత్మక నిర్గుణసత్యవికాసవిభో
కేవలశాంతిశరీర మహేశ్వర వందితపాదసరోజ విభో
భావవికల్పిత శ్రీమధుసూదన కావ్యసదాలయరాజ విభో

శా. ఈనామంబులురూపముల్ క్రియలు నేమీలేక నీవుండి,యీ
ప్రాణుల్ కర్మఫలంబు పొందుటకు రూపంబందిసృష్టింతు స
త్యానందంబులు నీస్వరూపము లనంతా! నిన్ను గుర్తింప వి
ఘ్నానీకంబులు మాపి యేలుము శుభాంకా !
రామచంద్రప్రభూ.

వ. ఆంజనేయుఁ డిట్లు శ్రీరామనామస్మరణ మొనర్చి మునుపటి
వలె నొక్క తనూరుహంబును బ్రహ్మాస్త్రంబుపై విడలింప
అదియు బ్రహ్మాండ మగలించునంత ప్రభావంతమై బ్రహ్మ

స్త్రమును గవిపి నిస్తేజంబు గావించె । ఇంద్రుఁ డదిచూచి నిర్విణ్ణుఁడై యున్న చతుర్ముఖునితో

శా. తాతా! చూచితె తత్ప్రభావము వృథా తాటస్థ్య మేలా? అదే యాతంకంబు జనించె లోజ్జువలె నీయస్త్రంబు నుజ్జయ్యె-న న్యాతచెర్య్యమనూనమంచు మదిలో నూహింపు-మెట్లైన మా కాతర్యంబును మాపు మాపయి జగత్కళ్యాణ మూహింపుమా !

వ. అనుచు నింద్రుఁడు భయకంపితుఁడై వేడ బ్రహ్మయు ఆంజనేయ ప్రభావంబు గుర్తించి ఓయింద్రా !

తే. తెలియ కీగతి నీదు బోధలను నమ్మి మోసపడి యస్త్రమును వమ్ముచేసికొంటి అన్నిఁటినిమించి కలదొక యస్త్రమిపుడు నే గ్రహించితి నది ఆంజనేయభక్తి.

వ. అనుచు చతుర్ముఖుఁడు భక్తిభావ బద్ధాంజలుఁడై ఆ మారుతికి సమీపంబునఁ జేరి

కేదారగౌళ - ఆదితాళము

ప॥ శ్రీ వాయుసూనుం భజే శ్రిత ।
వరదానఘనం ॥శ్రీ॥

శైవ వైష్ణవైక్య బోధాతనుం ।
భావ బలపాలితాఖిల భువనం ॥శ్రీ॥

చ॥ కేవలానందగాత్రం సంతత ।
భావిత శ్రీరామనామమంత్రం ॥

సేవకావన తనూరుహాతంత్రం ।
జీవపాపఫల లతాఖనిత్రం ॥శ్రీ॥

2. అంజనీగర్భ సంభూతం హ్రా ।
ద్రంజకవర భక్తపారిజాతం
సంజాత సకలకారణభూతం ।
సాధుమధుసూదనవినుత చరితం ॥శ్రీ॥

తే. అనుచు మస్తక ముకుళిత హస్తుఁడగుచు
నబ్జభవుఁడు నుతింప కృపార్ద్రహృదయుఁ
డగుచు పావని "యెవఁడ? వేమడిగెద" వన
విధియు నిట్లనె నపుడు సవినయుఁడగుచు.

శా. స్వామీభాస్కరమూర్తి! నీముఖమునంబద్ధుండుగాలోకము
ద్దామాంధత్వవిచేష్టితంబగుచు నిద్రాముద్రితంబయ్యెఁ దత్
క్షేమంబెంచి విముక్తసేయుము రవిన్ జేజేఁరక్షింపు! నా
నామంబొప్పవిరించి నా నికఁ గృపన్ నన్ జూడవేమారుతీ!

తే అనిన మారుతియును విని కనికరించి
"ఎవ్వఁడీకఁడు సూర్యుఁడా! యెఱుఁగ కేదొ
పండనుచుఁగొంటి నాకేమి పని"యటంచు
ఫూత్కరించెను రవియు సాక్షాత్కరించె.

వ. సూర్యభగవానుఁడును కాంతిమంతుఁడై యుండియు విన్నఁ
బోవుచున్నట్లు గ్రహించి "ఏలయీచింత" యని బ్రహ్మ
యడుగ భాస్కరమూర్తియు మెల్లఁగా ఓ పరమేష్ఠీ!
వినుము

ఉ. రామపవిత్ర నామజప రంజిత శీతముఖాబ్జమందు, నే
క్షేమముఁ గంటి-నన్నిపుడిసీ ! తమరందఱుబైటఁబెట్టి, పూ
ర్వామిత తాపరూపము సమర్పణసేసి-రొకప్పు చూడఁగాఁ
బ్రేమయుఁగూడ దోషమనిపించి వగర్చెద నీరజాసనా !

వ. అనవిని యోాభాస్కరమూర్తీ ! లోకానుగ్రహమున నీవు
మేరువుంజుట్టి పరిభ్రమింప ప్రాణికోట్లు ప్రవృత్తింబడి సుఖా
సుఖకర్మఫలం బనుభవించును. అటుగాక నీవే విశ్రాంతిఁ
గోరెదేని లోకము తమోభూయిష్టమై దీర్ఘనిద్రం జెందు ।
ఎవ్వరికేని లోకోపకారమునకన్న కర్తవ్యములేదు । నీవు
నియమభ్రమణమున మార్గదర్శకుఁడవు । కాల నియమ
మనుసరించి ఛాయాగ్రహంబగు రాహువు నిన్నాక్రమించు
టయు నాయాజ్ఞచేజసుగు । నీవుగ్రహములకు చక్రవర్తివి।
నిన్నాక్రమించు రాహువునకు ఈ యాంజనేయుని వల్ల
గర్వభంగమేర్పడినది । ఆంజనేయ ప్రభావము నిన్ను
గ్రసించుటచే జగద్విదితమైనది । పారదగుళికాయోగము
భద్రముగోరిన యోగి యనుభవించునట్లు నిన్నీతడింతసేపు
ముఖమున ధరించి మహిమోపేతుఁడయ్యెను । ఇది యం
తయు దైవికము । లోకాభ్యుదయముకోరి నీవిఁక మేరువును
జుట్టి పరిభ్రమింపు"మని సూర్యునకు రహస్యమును కర్తవ్య
మును ఉపదేశించి ఇంద్రాదిబృందారకులను తమనెలవు
లకుఁ బోవ సెలవిచ్చి రాహువునకు అభయమిచ్చిపంపి
తానేకాంతముగ ఆంజనేయునకు నమస్కరించి వినమిత
గాత్రుఁడై చతుర్ముఖుండు

శంకరాభరణం - త్రి । త్రిపుట

పరమాత్మపరిపాలయ । పరమోదారచరిత్ర ॥ప॥

కరుణయామాంసదా । కలయ సుగుణాలయ ॥ప॥

దీనోహమభివందే । దేవ పరంధామ

జానేమాయతినామ । శంకరం త్వా భూమ ॥ప॥

దేహిమే వరమిహ । దేవ విజితమోహ

ఏహి శ్రీ మధుసూదన । నేద్ధహృదయధామ ॥ప॥

శా. యస్యానంత పరాక్రమస్మృతి వశాద్భక్తాజయం
ప్రాప్నుయుః
దృష్ట్వారూపముదార మంచతిజనః సౌభాగ్యమత్యద్భుతం
కృత్వార్చాం విధినాతరంతిచభవంసంప్రాప్తసౌఖ్యోదయాః
తం భక్తావన దక్ష మంజనిభవం ధ్యాయేభవంతం సదా.

శా. నిత్యం చింతైకసార ప్రకటభవ మహాసాగరో న్మజ్జితానాం
భూతగ్రస్త స్థితీనాం విగతగతిధియాం నిర్ధనప్రార్థినాం
ఆఖ్యాతేతారకస్యాదితివిదితమహా మారుతేత్వాంశరణ్యాం
జ్ఞాత్వాసర్వావలంబం హరిహరమిళిత శ్రీస్వరూపంభజేహం.

వ. ఇట్లు నుతించు చతుర్ముఖుని గనికరించి నీ కేమివరంబు
కావలె కోరుమన బ్రహ్మయు సవినయంబుగా

శా. స్వామీనామనవిగ్రహింపుము జగత్సృష్టిప్రథంబొంది యె
ట్లో మీదివ్యకటాక్ష సారమున నేనుంటిన్ జగంబందునన్
నామర్యాదను నీవెనిల్పఁగవలెన్ నాయత్రస్త్ర నిర్బంధమున్
దామేమాత్రము చిత్తగించినసరే నాకున్ ముదంబేర్పడన్.

తోహర - చతురశ్ర

అనినుతించు వనజాసనునింగని యాదరించి కపివరుఁడు
కనికరించి "యేనుఁగడెలు బద్ధుఁడఁగా నుందుఁగాని పదుఁడు
తెలియక మఱియొక తీరుబంధనము సలుప నీయస్త్రమప్పుడు
నిలువనోప"దని వరమొసఁగ విధియుఁదెలచి ముదమంది
యప్పుడు.

౪౦. జయజయ సద్గుణధామా
జయజయ పరనికరభీమ జగదభిరామా
జయజయ కపిసుత్రామా
జయజయ శ్రీఆంజనేయ సజ్జనగేయా !

వ. అనుచు వినుతించి చతుర్ముఖుఁడు సత్యలోకమునకు
సంతోషమున జనె

## వరప్రాప్తి, చిరంజీవి

తే. మాతృసన్నిధికిఁ జనుచు మారుతియును
దారియందు శ్రమాపనోదకములైన
సాంద్రభూరుహ శీతల చ్ఛాయలందు
ఒడలుమఱచిన నిద్రలో నుండెనంత.

వ. ఇదేసమయమని ఇంద్రుఁడచ్చటికేతెంచి నిద్రించెడు
మారుతిని గాంచి

చం. భళిర ! యితండు నాపరువు పాడొనరించినవాఁడు-వీని ని
స్తుల బలదర్పమార్పుటకుఁ జొప్పడెఁబో అదనంచు నెంచి, త
త్కులిశమహాయుధంబునను గొట్టె మహేంద్రుఁడు
ద్వేషపూర్ణుఁడై
తలఁపక స్వీయగౌరవ మదప్రకథితాత్మ లకార్యదోషముల్

తోహర - చతురశ్రగతి

అయ్యోడ నాకులిశ మాంజనేయుని హనుభాగమ్మునఁ దవిలి
అయ్యోయని కేకనైచి వాలిచె నవనిపైఁ దనువు కమిలి
అయ్యార్తరవమువిని యనలుఁడు తనయాత్మజునికడకువచ్చి
అయ్యాయెనఁడేమిచేసెరాయని యడలుచుఁ మనసునొచ్చి

వ. పిల్లవాని నోడిఁజేస్సుకొని నిశ్చేష్టుఁడగుటచే ధైర్యము జారి
పోయి గుండెబాదుకొనుచు

ఉ. నారతనాలమూట బడెనా నడియేట నిదేమిటోయి! బం
గారపుఁబండు! నన్ననవు - కన్నది(గుడ్డిది నీదుకోసమే
పారఁదపంబుచేసి కడు భాగ్యముగానినుఁగాంచె-దాని నో
మారడిచేసినావ కొడుకా (బతుకీగతి (బద్దలైచనన్.

మధ్యమావతి - చతురశ్రగతి

ప॥ ఏరా కుమారా! నీ ।
వారమురా మాతో మాటాడ ॥వేరా॥

కోరి తిరుగు గృహచంద్రబింబమను ।
కొంటిమి కూలెను మాయాశలురా ॥వేరా॥

వినవా! నాఁగోడు నన్నుదయ
గనవా!... రావా ॥
మనసుతీర నొకసారిచూడు నీ ।
జననిబిల్చె దానినైన దయఁగన ॥వేరా॥

వ. ఇట్లు వాయుదేవుఁడు దుఃఖించుచూ తల్లి తెలిసిన నేమగునో
యని తల్లడిల్లుచున్నంతలో సంగీతకళాశాస్త్రపారంగతుఁడును
శ్రీహరినామసంస్మరణ పారంగతుఁడు విజిత సకలవిషయ

సంగతుఁడైన తేజోవిజితపారద నారదమహర్షి అచ్చటి కేతెంచి సమీరదేవుం గాంచి అతనియెడ దుఃఖకారణం బైన ఆంజనేయుని పరిస్థితిఁ బరీక్షించి "నీకుమారునకు మృత్యుభయంబు లేదు। ధైర్యము బాసినవానికిఁ గర్తవ్య జ్ఞానము దూరమగును। ఓజగత్ప్రాణా! దుఃఖమున ఫలము కలుగునా? ఎందుకిట్లు వివేకము గోల్పోయెదవు" వినుము

ఉ. చేసినకర్మకుం ఫలము చెట్టయొ మంచియొ తప్ప-దియ్యెడన్
మోసముపుట్టె-లోకగతిఁబోల్చి చరించెడు నీకు దుఃఖదు
ర్వాసనఁగూర్చె నెవ్వఁడొ కృపారహితుండయి-యేమనందునా
యాసయెగాని మంచితనమన్నది చూడరు స్వార్థదుర్జనుల్.

తో హ ర - చ తు ర శ్రి

అయినఁగాని నీశిశువు మూర్ఛితుండై యిటుపడియున్నాడు
భయముడుగుము కళతప్పలేదిఁకన్ భద్రగతియు సమకూడు
చేతనయినంత గాలియాడనటు చేయుము గిరిగుహఁజేరి
ఆతరువాతంజరుగవలయుపని నాచరింతు నేఁజేరి.

వ. ఇట్లు పుత్ర చిరజీవనోపాయము నెంచి నారదబోధితుఁడై సమీరుఁడు పుత్రు నెత్తికొని మేరుపర్వత గుహాంతరమున దాఁగియుండె। నారదమహర్షియు ప్రాణావశిష్టముగ గింజు కొనుచున్న లోకంబుజూచి తొలుదొల్త మహేంద్రునికడ కేగి యతనితో ఓత్రివిష్టపాధిపా! వాయుకుమారు నెవ్వరో హింసింప ఈలోకముగతి యెట్లుమూడినదో చూచితివా?

సీ. ఒకరుచచ్చుట మఱియొకఁ డేడ్చుటయు లేక
ధరగింజుకొనుచున్న నరులువీరె

ఆకువాడి శిరము లాడక కట్టైలా
సారహీనావని జమ్ములివియె
గొంతెండి కుప్పలై కొట్టుకొనుచుఁబడి
సీల్గెడు పశుపక్షి నికరమద్ది
గ్రహతారకాది నిగ్రహశక్తి చలియించి
గతులుతప్పిన భూతగణము లివియె

తే. సకలలోకస్థితికి నవసానసమయ
మయ్యెనిప్పుడు కను మమరాధినాథ !
త్వరగ నవ్వాయుదేవు పదంబుబట్టి
రట్టుమాన్పఁగ నడుమును గట్టుమయ్య !

రాజ్యభోగంబులు మరిగి - రంగసాని
సీతులల్లుచు దుర్మార్గుఁడై తనవిధి
తానుమఱచిన యే యాతతాయి యిట్లు
చేసెనో వచ్చి శమియింపఁ జేయుమయ్య !

వ. అనవిని ఇంద్రుఁడు "తనరహస్యము తెలిసియే యిట్లాడు చున్నాడేమో పొరపాటున వెల్లడించదుగదా!" యని గడగడలాడుచు ఎఱుఁగనట్లు నటించుచు నారదా ! "ఈ జరిగిన యపచారము సరిచేయఁదగినవాఁడు చతుర్ముఖుఁ డచ్చటికిఁ బోవుదమని యనుసరించిరా నారదమహర్షి సత్యలోకంబునకుఁ జని వాణీసమేతుఁడై నెత్తమ్మిగద్దెనున్న తనతండ్రికి నమస్కరించి నుతించి

ఉ. వింటివె తండ్రి! యీ కుటిల విప్లవగాథ-మరుత్సుతుండు దా నొంటిగనిద్రఁజెందు నెడ నోర్వక యెవ్వఁడొ యేమిహేతువో

కంటునఁ గొట్టిపోయెనఁట-గర్భవిఘాతముఁదం(డ్రియొుచ్చనే
యొుంటరిదాఁగె నయ్యనిలుఁ – డుప్పతిలెం (బళయంబు
ధాత్రిలో.

వ. ఇట్లు జరిగిన విలయవృత్తాంతము వినిపించి రక్షింపుమని వినుతింప చతుర్ముఖుఁడును జేయఁదగిన యుపాయంబు తోఁచక అందఱును అనుసరించి వెంటరా వైకుంఠమున కరిగి యచట శ్రీలక్ష్మీపరిసేవితచరణ కమలుఁడై పార్షద పరివేష్టితుఁడై యున్న శ్రీమన్నారాయణునిఁగాంచి

కల్యాణి – చా| త్రిపుట

ప|| పాహిపాహి ! వైకుంఠనివాస |
పారావారసుతా శ్రీనివాస

అ||ప|| మోహరహిత ముని మనోవిహార |
మూఢదుర్జన తరూగ్రకుఠార ||పా||

చ|| త్రాతా న వినా త్వామితిమత్వా |
తావకచరణం శరణం మత్వా
వీతాన్యవిషయ చిత్తావయమిహ |
ఆయాతా సేవకజన నేతా ||పా||

2. నందసునంద మునీంద్ర వినుతపద |
నతజనపికతోషవనవసంత
స్యందనమధువాగభయ విధాతా |
సాధు మధుసూదన హృదయనేతా ||పా||

శా. శ్రీవక్షం మణికాంత దివ్యమకుటం శ్రీరత్నహారోజ్వలం
శ్రీరాగోజ్వల మందహాస శమితో త్సాహ ధ్యజై వాత్మకం

శంఖాబ్జాసి గదావిభూషితకరం నారాయణాఖ్యం విభుం
వందే విష్ణు మనాద్యనంత మమర శ్రీమన్మనోమందిరం.

వ. ఇట్లు విధిముఖ్యులు సన్నుతింప శ్రీహరియుఁ బ్రసన్నుఁడై ఓ విధీంద్రముఖబృందారకులారా! మీరాకకుఁ గారణము గ్రహించితి నిపుడందఱము కైలాసమునకుం బోవుదము। ఆ శంకరునకా యాంజనేయుఁడు భిన్నుఁడు కాడు। శివ దర్శనమున వాయుదేవుఁడు సంతుష్టుఁడగుట కీవృత్తము దైవికముగఁ జరిగెఁగాని మృత్యుంజయుని మృత్యు వెట్లాక్రమించును? పదుండని అందఱను గైలాసంబునకుఁ దోడ్కొని చని నందీశునానతింబొంది యందఱును భక్తియుక్తులై

మిశ్రచాపు

శంకరాయ సమస్తలోక మహేశ్వరాయ మహాత్మనే
రాజతాద్రి సుతాప్రశోభిత వామభాగయశస్వినే
డామరోజ్జ్వలవహ్నిశూల మృగాఢ్యహస్త వాకాసినే
గాంగశోభిత మౌళిబద్ధ మృగాంక మోహనమూర్తినే
కామదాన కటాక్షమంజుల లోచనత్రయశాలినే
నాగభస్మదిగంబరాయ దినాంతనర్తన తోషిణే
విఘ్నరాజకుమార వందిత పాదభూషితభోగినే
స్వామినే మధుసూదనావన శీలినే హరయే నమః.

శా. శ్రీకంఠం శ్రితదాన తోషణరతం సిద్ధాఖిల శ్రీపదం
శ్రీకైలాసనివాసినం త్రినయనం విజ్ఞానలక్ష్యం విభుం
నిర్లిప్తోపి నిజాంగసంగత సతీ సౌభాగ్యపూర్ణం శివం
దైతేయోన్మథనప్రభావ మమలం నారాయణాస్త్రం భజే.

వ. ఇట్లు బ్రహ్మేంద్రాది బృందారకులు పురస్కృత శ్రీమన్నారాయణులై ప్రార్థింప శంకరుఁడును భక్తజన వశంకరుఁడును అగు శశికళాధరుఁడు ప్రత్యక్షమై "ఓ యమరులారా! మీావచ్చినపనిఁ దెలిసితి। శ్రీమన్నారాయణునకుఁ దెలియనిదేమియు లేదు। మారుతి చిరంజీవి। అయినను వాయుదేవ మనఃశాంతింగోరి యందఱ మచటి కేగుదము" అని సమీరదేవుండున్న మేరుపర్వత గుహాముఖంబునఁజేరి చతుర్ముఖునిం బ్రేరేపింపఁ జని వాయుదేవునితో బ్రహ్మయు దేవునిఁజేరి యనేకవిధములఁ బల్కరించియు నిరుత్తరుఁడై కడకు

ఉ. ఓయిసమీరుఁడా! పలుకకుందువిదేమిటి న్యాయమోయి!నీ
వే యిటులూరకున్న గతియేమగు నోయి! జగత్ప్రతిష్ఠక
న్యాయముఁ గూర్చకోయి! దయయన్న సమర్థుల
భాగ్యమోయి! పా
పాయినిమేనుచూచెదమపాయము నెంచకుమో సమీరణా.

వ. చతుర్ముఖుం డిట్లు వివిధగతుల బ్రతిమాలినను వాయుదేవుఁడు మౌనభావము విడువఁడయ్యెను। నారదమహర్షి మెల్లనఁ జేరి "ఓతండ్రీ! చతుర్ముఖా నిగమపరాయణా శ్రీమన్నారాయణా! ఇపుడు చేయవలసినది వాయుదేవ స్తుతికాదు, అతని పుత్రునకు చిరంజీవ ప్రగతి। ఎవరికెంత శక్తియో అంత యాతని బాలునకు ప్రసాదించిన వాయువు మఱల సదాగతుండై లోకంబునకు భద్రముచేకూరు ననఁగా ఆంజనేయుం జూచి

సీ. బ్రహ్మాయురస్తని పల్కె నబ్జాసనుం
 డఖిలార్థ సిద్ధిరస్తనెను విష్ణు
అఖిలసంపదలు తా నర్పించెఁ బురుహూతుఁ
 డభయంబు వచియించె ననలమూర్తి
నీకు బంటునటంచు నెమ్మిఁ బల్కె యముండు
 జలబాధ లేకుండఁ బలికెఁ బాశి
నాచిట్టితండ్రి యనశ్వరబలసుఖా
 యుః పూర్ణుఁడంచు వాయువు వచించె

తే. సర్వశాస్త్రములొసఁగ భాస్కరుఁడు పల్కె
సర్వసంసార సమరస సత్యరూప
భవ్య శ్రీరామ పదభక్తి భవుఁడు పల్కె
పావనియు శక్తుఁడై చిరంజీవియయ్యె.

వ. వాయుదేవుఁడు భరింపఁజాలని సంతోషమున పిల్లవాని నెత్తుకొని పొంగి గంతులు వైచుచు

సారంగ – చతురశ్రగతి

చిరంజీవి మావాఁడు నేడు ।
చిరంజీవియైనాడు ॥
ధరాతలము కళ్యాణమయంబై ।
నిరామయం బయ్యె నాంజనేయుఁడు ॥చి॥

సురలుసుమాసారంబు గురియఁగా ।
తరుతతి సుమఫలపూరితమ్ముగా ॥
హరిహరకథ లింటింట బాడఁగా ।
అలరుచు మధుసూదనకవి యాడఁగ ॥చి॥

వ. ఈవిధంబున సంతుష్టుఁడగు వాయుదేవునితో నారదమహర్షి

శా. అయ్యా! ఇప్పటికయ్యెఁ దృప్తి - యిఁక సధ్యాహారముల్ లేవు - ప్రా
పయ్యెన్ లోకశుభంబు - వీణఁయి నే భక్త్యర్థగీతంబు - సం
జయ్యన్ లక్ష్యము చేసి రాగములు ప్రస్తారించి మ్రోయింతు - నే
మయ్యెన్ మంచి కెయఁగానటన్న నుడి సత్యంబయ్యె సూత్రాత్మకా!

వ. ఇట్లు నారదమహర్షి గొనియాడ నందఱుఁ దమతమ నెలవుల
కేగిరి। వాయుదేవుఁడును ఆంజనేయునిం జేర్చి యంజనీ
కేసరులకు సంతోషమ్ముఁ జేకూర్చె.

బా ల్య ము

వ. ఆంజనేయుఁడును దినదిన వర్ధమాన ప్రభావుఁడై మేరు
పర్వతమున

సీ. చేతులు వ్రేలవంచిన కాళ్ళనడచును
ప్రాకులాడును గెంతుఁ బర్వులెత్తు
ఈ చెట్టుపై నుండి యా చెట్టుపై దూఁకు
వ్రేలాడుకొనఁబట్టి నేలకుదిగుఁ
బల్లటీలంగొట్టు డొల్లుఁ బండ్లికిలించు
డొక్క గోకుకొను నెత్తెక్కుదుముకు
నిదురించినట్లుండు నెత్తిఁ జేతులు చేర్చి
జవము మీరంగఁ దాండవ మొనర్చు

తే. కిచకిచనాడు లోయ లెగిరి తిరించుఁ
బండ్లు హనుభాగములనింపుఁ బర్వునఁ జని
తల్లియొడిఁ జేరి ముద్దుఁ దన్పుచుండు
నెల్లజగమేలఁగల గాలిపిల్లవాఁడు.

వ. ఆంజనేయుఁడు మహాబలోపేతుఁడై బాల్యమునఁ పర్వతం
బులు గోలకములుగా క్రీడించుచుండ తపస్వులు భయ
భ్రాంతులై

ఉ. బాహుబలమ్ముమీఱ నొక పర్వత మింకొక పర్వతంబుపై
నాహరిబాలుఁడేయుచు ముదావహ గాళకలీలసేయు_శై
లాహతి జీవరాసులడగారఁగ నాశ్రమభంగదుష్క్రియా
సాహసుఁడైనవాఁడనిల జాతుఁడుగాక మఱెవ్వఁ డీ ధరన్.

అ ఠా ణ – ఖండగతి

అసమాన బలుఁడీతఁ ॥ డనిలసుతుఁ డగువాఁడు
పసితనమునందెయిటు ॥ పాటవము గలవాఁడు ॥అ॥
వశముగా దితని నడ ॥ వడి మాన్ప నేనాడొ
పసచూపి బ్రహ్మాండ ॥ భాండములతోనాడు ॥అ॥
వరబలముఁ గొన్నాడు ॥ చిరఁజీవియైనాడు
నిరవధిక రామ జప ॥ నిష్ఠ వెలసినవాఁడు ।అ॥

వ. తపస్వు లందఱును ఆంజనేయుని సాహసకార్యములు
భావించి

తే. ఓయి పవమానపుత్ర ! నీకున్న బలము
నీకు విస్మృతమగుఁగాక ! నీకు నొరులు
తెలిపివినుతింపఁ గార్యసిద్ధికిఁ గడంగి
సఫలుఁడ వగుదుగాక ! యీ క్షణమునుండి.

వ. అనుచు శాపంబును ప్రయోజనంబును బల్కి రప్పటి
నుండియు ఇతరులు పలికినప్పుడేగాని తనబలము తా నెఱుఁ
గక మరుదాత్మజుఁడు తల్లికడఁ ముద్దుగఁ బెరుగుచున్నాడు

## విద్యాభ్యాసము

వ. జన్మారంభము నుండియు శ్రీరామనామ మంత్రమును జపించు ఆంజనేయుఁడు ఒకనాడు శ్రీరామ ధ్యానమును జేయు తల్లితో

శహాన — రూపకము

ప॥ తెలియనైతినే రామ। దివ్యరూప నామమహిమ ॥తె॥
పలికిన నాభావములో। ఫలపరిణామరహస్యము ॥తె॥

చ॥ ఎవరో యెటనున్నాడో। యేమిచేయుచున్నవాఁడో
కువలయమున మధుసూదను। కోరికలెటుతీర్చువాఁడో ॥తె॥

వ. ఇట్లు ప్రశ్నించు కుమారునిఁగూర్చి సంతోషించి "నాయనా! ఆ శ్రీరామమంత్ర జపముచేతనే నీకీ గండములు గడిచి సుఖముగానుఁడి చిరంజీవి వైతివి। మననము చేయుటచే మంత్రము మహిమాన్వితమై రక్షాదక్ష మగును। ఆ మంత్రాధిదేవతనుగూర్చి సద్గురుబోధ అవసరము। నీవు సూర్య భగవాను నాశ్రయించి శ్రీరామ నామరూప రహస్యమును దెలియుము" అని ప్రేరేపింప ఆంజనేయుఁడును తల్లికినమస్కరించి ఆజ్ఞగైకొని యాకసంబున కెగసి సూర్యభగవానుని దరిసి

ఉదయరవిచంద్రిక — రూపకము

శ్లో॥ నమోభగవతే తుభ్యం। గురవే జ్ఞానమూర్తయే
భాస్కరాయ సమస్తాఘ। వారణాయాక్షరాత్మనే॥నమో॥

వ. ఇట్లు నుతించు వాయుసూనునిఁగని నీ వెవ్వర ? వన

తే. సూర్యగురు భగవానుఁడా! సుఖముగాఁగ
నుంటివే! యుష్మదంఘ్రి సేవోత్సుకుఁడను

వచ్చితిన్ మారుతి యనంగఁ బరగువాఁడ
చిన్ననాఁడు నినున్ ఱ్రమింగి చన్నవాఁడ.

వ. మారుతి భాషణమునకుఁ బిన్ననవ్వొలయ భాస్కరమూర్తి సంతోషించి ఆంజనేయా! నీయభీష్టం బేమన అతఁడును నమస్కరించి, "స్వామీ! మీ అంతేవాసినై పరమార్థ రహస్యము నపేక్షించి వచ్చితి"నన విని సూర్యుఁడు

ఉ. "ఏవిధిగా గురుత్వము వహింతును దీరక మేరుపర్వత స్థావరముం బ్రదక్షిణము సల్పుటనావిధి"యన్న సూర్యుఁ "దా తా! విను బూర్వపశ్చిమకులాద్రి శిరంబుల గాళ్ళు వెట్టి వి ద్యావిధముం గ్రహింతును దయన్ గను" మంచనె
బ్రహ్మచారియున్.

సావ - ఆది

జ్ఞానోపదేశము చేయవే।
నే నిన్ను సేవించెదను సదయ ||జ్ఞా||
నానావిధ ప్రాపంచిక।
నామరూప కారణమేమొ తెలిపి ||జ్ఞా||
శ్రీరామనామ ఫలరూపమేమొ।
సేవ్యసేవకాది భేదభావమేమొ
కామమూలమేమొ కాలమూలమేమొ
కమనీయ మధుసూదన భావమేమొ ||జ్ఞా||

తే. స్వర్ణముగఁ జల్వు నినుమును బరుసవేది
స్వీయగుణ గౌరవార్హము సేయలేదు
సద్గురువు శిష్యులకుముక్తి సరగఁగూర్చి
తనదువలె గురు గౌరవార్హుని నొనర్చు.

వ. అనుచు వినుతించు నాంజనేయునిఁ గనికరించి లోకబాంధ వుఁడు ఓ ఆంజనేయా! వినుము!

సీ. ఘటమునకున్ మృత్తుకరణి నుపాదాన
కారణము ప్రకృతి తానెయగుచు
దండచక్రాది సాధన విధమునఁ దానె
భూతతన్మాత్రలు నైతనరుచు
మృత్పరిణామ నిమిత్త కులాలుని
కరణినిఁ దానె యీశ్వరుఁడు నగుచు
దననెఱుంగక యవిద్యావృత్తుఁడై ప్రమందు
జీవాభిదుండు తానై వెలయుచు

తే. సర్వగతమయ్యు మఱి తటస్థముగనుండి
తానె సర్వజగద్వివర్తముగ నగుచు
వెలయు నేకమభిన్నమా విమలతత్వ
మదియె శ్రీరామ మంత్రార్థ మాంజనేయ !

కం. ఎల్లం జిత్రగతులకుం
దెల్లని తెలివోలె నిజముఁ దిలకింపఁగ నీ
యెల్లజగంబుల కాత్మయె
తెల్లముగా మూలమనుచుఁ దెలియుము మదిలో.

వ. కాలానుగుణంబుగా ఆకాశ అనిల అనల జల ధరణిస్థిరచర ములుగా దృశ్యరూపములఁ బరిణమించి అన్నివిషయము లలో తానుండి ఉండుట, పుట్టుట, పెరుగుట, చూడ బడుట, పరిణమించుట, నశించుటయను షడ్భావవికారము లను పొంది అనాదికర్మఫలానుసారంబుగా సుఖదుఃఖంబు

లను అజ్ఞానవశమున అనుభవించు నప్పుడు జీవుఁడను పేరఁ బిలువబడుచు మహాశక్తి సంపన్నులగు బ్రహ్మవిష్ణు మహేశ్వరులును దానెయై యేదియునుగాక నామరూప క్రియలు కర్మఫలానుభవమునకు యోగ్యముగా ధరించుచు వదలుచు శాస్త్రవిహితములగుసత్కర్మలాచరించుచు పుణ్యసంస్కార బలముచే పాపములు బాసి పరిశుద్ధాంతఃకరణమున ఆత్మ జ్యోతి దీపింప విషయ ప్రపంచవాసనల కెడమై శరీర ముండియు లేనట్లు భావించి ఆకాశమువలె వ్యాప్తభావం బున శాంతియు ఆనందము మాత్రము మిగిలి ముక్తస్థితిని పొంది యీ జీవుఁడే పరమాత్మ యనబడును । ఆ పర మాత్మయే సర్వశక్తిమంతమైనది కనుక ప్రపంచమునం దధిక భాగము పాపబాధితమైనపుడు దుష్టశిక్షణము శిష్ట రక్షణముచేసి ధర్మంబు స్థాపించుటకొరకు ఎప్పటికే రూప మవసరమో ఆరూపంబు ధరించి యాపని చేసి అవతార ఖ్యాతి నందును । అట్టిపరమాత్మ పరిపూర్ణమానవత్వంబు ఉపాధిగా భూమియం దవతరించి శ్రీరామనామ విఖ్యాతిఁ జెంది భార్యావియోగ మిషచే దుఃఖవంతుని వలె నటిం చుచు సానుజుండై యడవుల వెదకుచూ వచ్చి

సీ. ఏ చోట సతితో మునీశుఁ డగస్త్యుఁ డా
శ్రమము నిర్మించి తపము నొనర్చె
నే యెడఁ గృష్ణవేణియుఁ దుంగభద్ర గో
దావరుల్ ప్రవహించి ధన్యతఁగనె
నేతావు వేదశాస్త్రోక్తత కర్మభూ
యిష్టమై కోరిక లిచ్చు యెసఁగ

నేనేల యంధ్రక్షితీశ్వరుపేర వి
ఖ్యాతమై ఆంధ్రదేశాఖ్య వెలసె

తే. అందు విలసిల్లు ఋష్యమూకాద్రిపాద
భవ్యపంపాసరోవర ప్రాంతమందు
సర్వధర్మ స్వరూపుఁ డగు రామచంద్రమూర్తి
అగపడును నీకు నిజమనిలాత్మజాత !!

తే. మౌనివేషమ్ము మీర నేమహితమూర్తి
విమలములు నీ సహజకుండలములు గాంచి
అనుజునకు గుర్తుఁ దెల్పెనో అతఁడె మంత్ర
దేవుఁడగు స్వామియని మదిఁ దెలియుమయ్య.

వ. ఆ పురుషోత్తముఁడగు శ్రీరామచంద్రుని భార్య సీతపేరఁ బరగు యోగమాయ । విడివడియున్నట్లుతోఁచు వారి నొక్కటిగా భవాబ్ధిఁ దరించు యోగివలె నీవొక్కఁడవే సముద్రముందాటి పరస్పరము గుర్తెఱిఁగించి శ్రీ సీతారామాద్వైత స్వరూపంబును దర్శింపఁగలవు నీకు దైవ బలంబు సమకూరును

ఇది యిట్లుండ నొక్క లౌకికరహస్యమును వినుము!

ఉ. ఆవల మేనమామలు సమర్థులు వానరరాజ వాలిసు
గ్రీవులు వారుసోదరులు కేవలవైరముఁ బూనియుంద్రు-సు
గ్రీవుఁడు మత్కుమారుఁడు వరింపుము తద్ధితమెట్టులైన-నా
తావున నింద్రసూతి నహితక్రియ వాలిని నమ్మఁబోకుమా!

తే. ఇంద్రుఁడే మొన్న మొన్న నిన్నడఁచె - నీదు
తండ్రి పుట్టుకలో విరోధమ్ముఁబూనె

నాతఁ డనుకొన్నపని వ్యర్థమైన యప్పు
డతనిపుత్రుఁడు వాలి నీకగునె హితుఁడు.

కం. తనపుత్రుఁడగుట వాలికి
నని నభిముఖుఁడగుచు నెవ్వఁడైన నిలువఁ ద
త్తనుబలము సగముచేరెడు
నని శక్రుఁడు వరమొసఁగె రహస్య మెఱుఁగుమా!

తే. నాకు శిష్యుఁడవీవయి, నాకుపుత్రుఁ
డరయ సుగ్రీవుఁడగుచు, నా యన్వయమున
జన్మమందెను శ్రీరామచంద్రమూర్తి
మీరు మీరును హితులయి మేలుగనుఁడు.

వ. అనుచు సకలరహస్యములు బోధింప వినయంబునగ్రహించి సూర్యునిసేవించుచు నొక్కనాడు శ్రీరామదర్శనాపేక్షతో ఆంధ్రదేశమున నలరు ఋష్యమూకగిరి కరుగఁ దలఁచి గురునాజ్ఞం బొందఁదలఁచి నమస్కరించి యిట్లనె

తోహర – చతురశ్రి

భవదీయామలబోధచే నాత్మభవయోగామల సుగతిన్
భువనైకావన! పొందినాను నా। పుణ్యమున యథార్థరతిన్
ఏవిధిన్ గురుఋణమ్మునుదీరిచి యిప్పుడు కృతార్థుఁడనగుదున్
భావించి యానతిమ్మన విని యాభాస్కరుఁడ నెనిటునగుచున్.

మ. "భవదీయామలబోధచేఁ బడసితిన్ భద్రంబుగా నాత్మసం
భవయోగామలనిష్ఠ"యంటి విదియే భావ్యంబు–వేరేల! యి
య్యవికావే వివరింప దైవికము–లంతే నిన్నుఁ గోరెం దనూ
భవ – దానింగయిసేసి యిట్లు ఋణముం బాయంగ
నూహింపుమా.

వ. ఆంజనేయుఁ డాశ్చర్యమున ఒక్కింతసేపు స్తంభీభూత మనస్కుఁడై నే నేమంటిని ? నేఁ జేయవలసిన దేమి ? వివరంబుదెలుపవే యని అర్థింప నీవు దైవికముగాపల్కిన మాటలో "మీాబోధవలన మీా కుమార్తెను భార్యగా పొందినాను, అను తాత్పర్య మున్నది । ఆపల్కు నిజము చేయుము ; సువర్చలా బాలను నీవు అర్థాంగిగా గ్రహింపుము ।నీవు నాయాజ్ఞపాలించి ఋణవిముక్తుఁడవయ్యెదవు" అని భాస్కరమూర్తివచింప మారుతియుఁ దనలో

అఠాణ - ఖండగతి

ప॥ ఏమిసేయుదు దైవమా... । గురునాజ్ఞ
కేమందు నా వ్రతము । నేమందు మందమతి ॥నేమి॥

చ॥ రామారామా తిరుగ । రాని బంధంబయ్యె
భామతో నెటుకుదురు । బ్రహ్మచర్యపుఁగుదురు ॥ఏ॥

2. అనుకొనిన దొకటైయె । ఐనపని యొకటైయె
మనసు నాదేవుఁడే । మలుపుకొనెనో యేమొ ॥ఏ॥
తనుధారికేమి స్వా । తంత్ర్యంబు లేదేమొ
మనుగడకు దేవుఁడే ॥ మార్గదర్శకుఁ డేమొ ॥ఏ॥

వ. అనుకొని చింతించుచు తనసంకల్పమునకు వ్యతిరేకము సహింపలేక సూర్యునితో

కం. గురువర్య ! బ్రహ్మనిష్ఠన్
జరుపుచు భవముందరించు సంకల్పముతోఁ
బరగెడు నాకిటులీ సం
సరణపుఁ గర్తమునఁబడుట చనునే మఱిలన్.

తే. అనినవిని సూర్యుఁడుఁ వినుమయ్య! ధర్మ
మెడసి చనరాదు – దేవుఁడట్లేలఁ బల్కఁ
జేసెనోగాని వ్రతఫలసిద్ధికొఱకు
సద్వితీయత బలము నొసంగుఁ గాఁత.

ఉ. తాను గృహస్థుఁడయ్యు విధిఁదప్పక నెమ్మది బ్రహ్మభావసం
ధానితమయ్యెనేనియు వ్రతస్థితి లోపమురాదు–పంకజా
స్థాని చతుర్ముఖుండు వ్రతసంగతిమానెనె వాణిగూడియున్
మానులు సద్వితీయులయి మానక బ్రహ్మఋషిత్వమందరే.

తే. మనసు బ్రహ్మమయంబుగాఁ జనునుగాని
బ్రహ్మచర్యము నామమాత్రమునఁగాదు
బ్రహ్మచర్యము లేని గార్హస్థ్యమైన
సన్యసనమైన నిష్ప్రయోజనమె సుమ్ము.

శ్రీరంజని – త్రి – త్రిపుట

ప॥ మర్మమును దెలిసికొనుమా...నీ ॥
ధర్మమును నెఱవేర్పుమా ॥మ॥

అ॥ప॥ కర్మలోన నకర్మ తెలిసి అ ॥
ఖండ శాశ్వతానందమందుమ ॥మ॥

చ। తెలివిలోపలబాధయుండదు ॥
తెలియకెన్నఁడు ముక్తికలుగదు
తెలివికొకరూపంబు వెలయదు ॥
తెలివి నీవైయీ ప్రపంచము ॥మర్మ॥

వ. "ఇంక నీవు గురుదక్షిణగ నా యాజ్ఞనుపాటించి మదీయ కన్యాపాణిగ్రహణము చేయక తప్ప" దను భాస్కరుని యాన ఆంజనేయుఁ డంగీకరించె

## శ్రీసువర్చలాంజనేయ కళ్యాణము

అంజనీకేసరుల కపుడు పుత్ర వివాహ శుభవార్తఁ దెల్పుటకు దేవగురువు మొదలగు గ్రహనాథులందఱుం బయలుదేరిరి। ఇచట సూర్యపుత్రికయగు సువర్చలాదేవి ఆంజనేయుని మదినెంచి తనలో దాను

ఉ. చక్కనివాఁడు మేలిమిపసందగు చాయనెసంగువాఁడు-పెం
పెక్కిన భక్తిశక్తియు వహించినవాఁడును, జావుపుట్టువుల్
దక్కినవాఁడు, శౌర్యఘనతన్ జగమేలెడువాఁడు, భక్తికిన్
జిక్కెడువాఁడు మారుతి విశేషకృపన్ ననునేలకుండునే.

వ. ఇట్లాలోచనలతో మునిఁగి తేలుచున్న సువర్చలాదేవితో సఖీమణులైన అశ్విని మొదలగువారు క్రీడాలాలసలై ఆపెతో

సీ. మదగజయాన నెమ్మది నేమి యోచింతు
వనకేళికై యేల వలఁచిరావు
సారంగనయన ! ఆశలుమీఱు కడగంటి
చూపుములుక్కు లెవరు సొక్కిలకు
కలకంఠి! యేమి యాకర్షించె నీమది
కింపైన వీణ మోయింపవేల
అమృతవాణీ! యేల యాదరింపవు చెలుల్
పాడెడు నాత్మప్రభావగీతి
తే. రేవెలుఁగు జూచి రోయుదు వేవెలుంగు
పుట్టువా ! లేవగలివేల ? గుట్టు తెలుపు
మేవగింపులుమాను - మింకేనిలింపు
లైన నోతన్వి ! నీతన్వికైనవారె.

వ. అనుచుఁ బెక్కుభంగుల హాస్యంబులాడియు, రహస్యంబులు పల్కియు నభూతంబులు కల్పించియు, లాస్యంబులఁ బరి వర్తించియు, తాటస్థ్యంబువహించియు మనోవిధంబెఱుఁగఁ బ్రయత్నించు చెలులతో సువర్చలాదేవియుఁ బిన్ననవ్వు చిన్న సిగ్గు వెలయ

జంఝూటి — రూపకము

ప॥ మహిమకలుగువాఁడే నా । మదిని జూరకొన్నాఁడే ॥మ॥
మహిలో మారుతినిమించు । మాన్యులెవ్వరున్నారే ॥మ॥

చ॥ పసితనమునఁ బండనుకొని । భాస్కరునే మ్రింగినాఁడే
అసమానుఁడు చిరఁజీవియై । అలరునె అంజనిసుతుఁడే ॥మ॥

2. నిరతరామనామధ్యాన ॥ నిష్ఠుఁడైనవాఁడే
చరణదాస మధుసూదన । వరదుఁడై వెలసినవాఁడే ॥మ॥

వ. ఇట్లు తనకోర్కెను వెల్లడించిన సువర్చలాదేవితో కొంత తడవు ఉచితరీతిఁ బ్రొద్దుపుచ్చి చెలికత్తె లీవిషయమును తల్లియైన సంజ్ఞాదేవితోఁ దెల్ప నూహించి "ఓయమ్మా! మీయమ్మాయి ఆంజనేయుని మనోహరుఁడుగా భావించి విరాళిఁబడుచున్నది - చూడుము !

సీ. కాకమ్మ! కాకమ్మ! గంతువేయుము కోర్కె
కనుకూలముగనంచు ననువదించు
అంగుళుల్ ముక్కుపై నాడించి కాయయొ
పండో దెల్పుమటంచు బాలలకిడు
సరియొ బేసియొ ప్రశ్నసరణి యీమార్గానఁ
దోచులెమ్మని చీల్చుఁ దుంగపోచ

పల్కవే నాకోర్కె పండువెట్టెదనని
వలచి రాచిల్కను బలుకరించు

తే. అందములు చేసికొనిచూచు నద్దమందు
తమ్మితేకులప్రక్కపై సొమ్మసిల్లు
మగఁడు మారుతినాకని మనసునిల్పు
లావెతిఁగి మాటికి సువర్చలావధూటి.

వ. ఇట్లు చెలులుచెప్పిన మాటలువిని సంజ్ఞాదేవియు ఈ రహస్యము సూర్యున కెఱిఁగింప ఆదంపతులు తమకుమార్తెయైన సువర్చలాబాలతో

తోహర - చతురశ్రగతి

ఏలనేయింత వలచె దితఁడు వరియించు బ్రహ్మచర్యమ్మ
ఆలోచించి వచించు మితనిపై నలరుమనసున నిజమ్మ
అనఁగనాపె యోతలిదండ్రులార! ఆనందాయతనమ్మ
వినుఁడంజనిసుతుఁ డాబ్రహ్మచారి వెలయునుబతిగ నిజమ్ము.

శా. ఏయానందముమించి లక్ష్యమిఁక లేనేలేదో యీజన్మకే
నాయానందమునే వరించితిని - బ్రహ్మానంద భాగ్యోదయ
ధ్యేయశ్రీచరణున్ సమీరసుతు వర్ధిష్ణున్ సురారాధ్యునిన్
శ్రేయోరూపుని నాత్మసాక్షిగవపుః శ్రీకంఠితున్ జేసితిన్.

వ. అనుటయు నందఱు వధూవర పరస్పరాంగీకారములకు సంతోషభరితస్వాంతులైరి ।

అచట గురుముఖ్యగ్రహపతులును ఋషులును అంజనీకేసరిదంపతులతో సువర్చలాదేవినిగూర్చి అభివర్ణించుచు

సీ. తుమ్మెదల్ తరలాడు తోయజాతప్రభ
కన్నను గాటుక కన్నుదోయి
మదనుఁడు చేఁబట్టు మంజుధనుర్యష్టి
కన్నను గొనవంపుఁ గన్నుబొమలు
తాటంక లలిత రత్నాకరసుతకన్న
శ్రీకార లలితమౌ చెవులజంట
భవ్యశుకాకృష్ట పక్వబింబఫలంబు
కన్నను వాతెఱ కాంతిరేఖ
తే. రత్నమయ గుణశోభిత రమ్యకలశ
యుగముకన్నను గుణపూర్ణకుచవిభవము
దనర వర్ణింపరాని సౌందర్యపేటి
వేవెలుఁగు కానుపు సువర్చలావధూటి.

తే. అందముల నచ్చువోసినయట్టులున్న
యాలతాంగికిఁ దగు మనోహరుఁ డెవండొ
యనుచు సంజ్ఞయు రవియుఁ దా మరయుచుండ
నపుడె విద్యార్థియయ్యె మా యాత్మజుండు.

వ. శ్రీ సువర్చలాదేవి విద్యాపూర్ణుఁడగు మా కుమారుని వరించినది। సూర్యబోధచే ఆంజనేయుండును పాణిగ్రహణంబున కంగీకరించె. ఇట్టి వియ్యంబును మీరును అంగీకరించి లోక కళ్యాణంబుఁ గూర్పుఁ డన సువర్చల భాస్కరున కెట్లు కుమార్తె యయ్యెను బల్కుదరే ? యను కేసరితో గ్రహపతు లిట్లనిరి.

తే. దేవశిల్పికి సంజ్ఞనా దివ్యతేజ
మలర నొకపిల్ల కల దది యనుపమాన

గుణవతి - ప్రభాకరుని మదిఁగోరి యఁతని
నాపె వరియించె వలపు పెల్లావరించి.

వ. దేవశిల్పియును ఆపెభావంబుఁ దెలిసి యాపెతో అమ్మా !
సూర్యుఁడు మిక్కిలి ఖరకరుఁడుకదా ! నీకుఁ దెలియక
వరించితివి వినుము

ఉ. మోహము గ్రుడ్డిదమ్మ! నిజమున్ గననీయక కప్పిపుచ్చు-నే
యూహలుచేయనీయదు, యధోచితకాలవిలంబమోర్వ-దు
ద్వాహముచేయునప్పుడు యదార్థమెఱింగిన వారిమాటయే
దోహదమాటఁదప్పక యధోక్తముగాఁజరియింపనోఁజుమీ

కరహరప్రియ — చ - త్రిపుట

ప॥ తగినవానిఁ దెలిసికొని వరింపఁగఁ
దగును గురులనుమతించు విధమ్మున ॥త॥

అ॥ప॥ అగలపొగలవాఁ డని రవిఁ దెలిసి
మొగమాటమువిడిచి మోహము నడఁచి ॥త॥

చ॥ పగలంతయుఁ దాపముగూర్చును, దా
పగువారికిదాఁ బగవాడటు — దాఁ
పఁగరాని యుదారుఁడెకాని సుధా
పగకైన వృథావగఁ గూర్చుఁ గనుక ॥త॥

వ. ఇట్లెంత పలికినను సంజ్ఞవినక రవినే తన పతిగా భావించి
అనన్యచిత్తయై యుండెను । ఇఁకఁ జేయునదిలేక విశ్వకర్మ
సూర్యుని వద్ద తనవిధము నెఱుకపఱచి సూర్యుని మెప్పించి
తదనుమతితో సంజ్ఞను సమర్పించి మహావైభవముతో
వివాహమ్ము చేసెను । కాని సంజ్ఞాదేవి కాపురమునకు

వెళ్ళి సూర్యుని వేడిమికిఁ దాళలేక తిరిగి యింటికివచ్చి తల్లిదండ్రులతోఁ జెప్పి సూర్యానుగ్రహాపేక్షతోఁ దపము సేయనెంచి సముద్ర గర్భమునఁ జేరెను । విశ్వకర్మయుఁ జేయునదిలేక తన మనమున

భవప్రియ — ఆది

ప॥ చేసికొన్న దనుభవింపవలదా ।
క్షితిలోపలఁ దనుధారులు తెలిసి ॥చే॥

వాసిగాను జన్మాంతరకర్మల ।
ఫలమెవ్వఁడు కాదని గడితీరును ॥చే॥

చం॥ మమతాబంధము సంబంధముకల ।
మనుజులందఱన్ బాధించుగదా
సుమతులు మోహమును విడిచి మధుసూ ।
దననుతు మదిని భజించి తరింతురు ॥చే॥

వ. ఇట్లు చింతించుచు విశ్వకర్మ ఎంతకాలము చూచినను సూర్యుఁడు పశ్చాత్తపించినట్లును శాంతించినట్లును దోఁచక కోపభావమూని తనలో

చం. అడిగిన విచ్చుచుం గడుఁబ్రియంబునఁ జూచెడు మామయన్న న
ల్లుడు ప్రియమందుచేయఁడు–లోపములేకని పెట్టుచుండు–నె
ప్పుడు వ్యతిరేకభావపరిపూర్ణత నల్లెరుపైనబండి య
ల్లెడఁ బెడనాడు "తె"మ్మనుటయే భవతారకమంత్రమైచనన్.

వ. ఇట్లు పరితపించుచు నొక్కనాడు సూర్యునివద్దకుఁజని

ఉ. నీచరణంబులన్ మనసునిల్పని దోషమ హేతువేమి? యి
ట్లేచెదు నాదుబిడ్డను గ్రహింపవ యిదేయ్యది నీకుధర్మమా
యోచనఁజేసి తొల్దొలుత నొప్పి యనంతరమిట్లునొప్పి సం
కోచము లేకగూర్చునిను గూర్చివగర్చుట మాకుఁగర్మమా!

వ. ఈవిధముగ మామగారి ద్వ్యర్థభాషణంబు గ్రహించియు
యుగ్రతంజెందక "మామా! నీకూతు రిచ్చటనయున్నది।
ఇరువురు పిల్లలంగన్నది। ఎందుకింత నీచింత ?" యన
విశ్వకర్మ వారలం బిలిపించి జూచి ఆశ్చర్యమున "ఓసీ
యెవ్వతెవు ?" సూర్యునితో నెట్లుండగల్గితివి ? నిజము
దెల్పుమన నాపెయు

తే. నీదుకూతురు సన్న అనిందితాత్మ
అర్కునకు సేవసేయ నన్నప్పగించి
ఆపె తపమున కేగె నే నర్కుసేవ
చేయుచుంటిని ఛాయ యన్ జిన్నదాన.

తే. స్వామి తూర్పుననున్న నేఁబశ్చిమమున
స్వామి పడమటనున్న నేఁ బ్రాక్తలమున
స్వామి పైనున్న పదములఁబడి నయమున
నుండి నిశలందు కలియుచు నోర్చియుంటి.

వ. స్వామి యనుగ్రహామున తేజోవంతులును బలవంతులునైన
ఇర్వురు పుత్రులంబడసితిని. వీరె యమ శనైశ్చరులనుచుఁ
జూప విశ్వకర్మయు "నోసీ నాపుత్రికయు నీవు నొక్క
పోలికనుండి ఈ యుపాయంబు చెప్పక అన్యభోగ్యము
నపేక్షించితివి. కావున నీవును నీపుత్రులును నల్లనివారై

యుందురుగాక!'' అని శపించె- సూర్యుడును జరిగినపని కాశ్చర్యముచెంది సంజ్ఞాదేవిని వెదకుచు సముద్రగర్భము చేరి అశ్వరూపముతోనున్న ఆపెను గ్రహించి తానును బడబారూపంబున ఆపెతో సుఖముగ నుండఁగా వారికి అశ్వముఖులైన ఇర్వురు పుత్రులు కలిగిరి. వారే అశ్వినీ దేవతలనఁ బ్రసిద్ధివహించి యజ్ఞమున హవిర్భాగంబు లేక పాత్రసాధనంబుగఁ బొందిరి। వారే దేవవైద్యులుగ జగద్వంద్యులైరి।

విశ్వకర్మ చతుర్ముఖుని కడకేగి సంప్రార్థించి సూర్య కాంతిని సంకుచితముచేయు నుపాయము అనపాయముగ జేసి నాకొర్కెఁదీర్పవే" యన తామరసచూలియు సూర్యుని మెప్పుమాటలాడి యొప్పించి తరిగొబట్టుట కనుమతింప విశ్వకర్మయు రవిబింబమును దరిగొపట్టినపుడు పుట్టిన సూర్యపరాగము తేజోవతియైన బాలికయై శ్రీ సువర్చల యనుపేర ఆవిర్భవించె। శ్రీ సువర్చలాంజనేయులు అనన్యభావులు। లోకవంద్యులు సుమా! యన అంజనీ కేసరులు సూర్యపుత్రికా సంబంధమున కంగీకరించిరి। నిశ్చయతాంబూలంబులుపరిగ్రహించి సుముహూర్తంబులు పల్కి గ్రహపతు లేగిరి। అందఱుం దమతమ ప్రియబంధు సుర నర మునిజనంబులం బిల్చుకొనిరి। అంజనీకేసరులకు వాయుదేవుఁడు తన దివ్యమృగవాహనం బేర్పాటుచేసి తర్లిపోయి సూర్యదేవుఁడు ఘనస్వాగతములు వచింప

సీ. బ్రహ్మ విష్ణు మహేశ మను వసు కశ్యప
గౌత మాత్రి వశిష్ఠ కపిల ధౌమ్య

గాలవ నారద కౌశిక వామదే
వాసిత గృత్సమదార్చనాన
సాగస్త్య వసు పులహోత్య మార్కండేయ
భవ్యవాల్మీకి భరద్వాజ పూజ్య
సనకసనందన చ్యవ నాంగిరస యాజ్ఞ
వల్క్య విశ్వామిత్ర భార్గవాది

తే. ఋషులు మునులును మఱి రాజఋషులు లోక
పాలకులు గ్రహనక్షత్ర పాళిసురులు
గరుడ గంధర్వ సిద్ధ కిన్నరులు నరులు
వచ్చిరపు డాంజనేయ వివాహమునకు.

వ. సకల భక్తజనసందోహములు ఆ మహోత్సవముఁ జూచి తమలో

కళ్యాణి — ఆది

ప॥ శ్రీకరమగు కల్యాణము చూడరే ।
శ్రీ సువర్చలాంజనేయులకు భవ ॥శ్రీ॥

అ॥ప॥ ప్రాకటముగఁ గన్యాదాతయగుచు। భాస్కరుండలరఁగా
సురులు సుమవర్షము కురియ ॥శ్రీ॥

చ॥ సరసిజాసనుఁడు మంత్రముపఠింప
వరమారుతి పాణిగృహీతగా
సురదుందుభి,లాకసమున మ్రోయఁగ
సరగ మధుసూదనుఁడు సంగీతకము నెఱప ॥శ్రీ॥

వ. అట్టి జగద్విఖ్యాతమగు సువర్చలాంజనేయ కళ్యాణము జరుగునప్పుడు దేవముని బృందములు భక్తిభావపరిపూర్ణ చేతస్కులై

మానిని:- శ్రీసువర్చలాసతీ విభూషితాంక ! భక్తసం
త్రాణశీల ! వంద్యభాసురాకృతే ! జగత్పతే !
తే పదం శరణ్య మర్థిలోక శ్రీకర ! ప్రభో
భావయే సదాభవాబ్ధి తారకం నిరంతరం.

అభయద బహుకీర్తే శశ్వదానందమూర్తిన్
అసురశమన శక్తే విశ్వరక్షైకవృత్తే
శరణమిహ ప్రపద్యే మారుతే ! తోషకంధే
విజితకనకదీప్తే పాహిమాం రామశక్తే.

## దండకము

శ్రీమన్ మహోదారచారిత్ర ! సౌవర్ణ దేదీప్యమాన ప్రభా పూర్ణగాత్రా ! కృపాపూర్ణనేత్రా ! జగద్వంద్య కౌండిన్య గోత్రా ! జగత్ప్రాణపుత్రా ! పవిత్రాంజనీ నిత్యసంతోష పాత్రా ! భవత్పాద నీరేజమున్ భక్తి నూహించినంజాలు నాయుఃప్రమాణంబు హెచ్చున్ – మహారోగ్యభాగ్యంబులుం గల్గు—నీవీరరూపంబు ధ్యానించినంజాలు సర్వగ్రహాతంకముల్ సర్వపైశాచికాడంబరంబుల్ భయభ్రాంతులున్ దాప పూర్ణ జ్వరంబుల్ మహాభూత రక్షోదురాచారముల్ శాకినీ ఢాకినీ దుష్ప్రచారంబులున్ సర్పకీట ప్రభూతంబులౌ దుర్విషంబుల్ పటాపంచలౌ – నగ్ని వాయ్వ ప్రకోపంబులున్ జాడ్యముల్ జారిపోవున్ – శిరశ్శూల ముఖ్యాంగశూలల్ గనన్ నామ

రూపంబులేకుండ శాంతించు - చోరాదిబాధల్ శమించున్ -
వినాశంబులౌ నాధిదైవ్యాదికంబుల్ - శుభంబుద్భవించున్ -
బరేశా ! సదానందకోశా ! శ్రితాభీష్ట దానావనావేశ !
దుర్విఘ్ననాశా ! సదా రామనామప్రకాశా ! స్వభక్తామ
లానంద భావోన్నివేశా ! సదామ్నాయ బోధోపదేశా !
సువర్ణాంగనాజీవితేశా! భవత్పాదయుగ్మంబు ధ్యానించెదన్-
సర్వశస్త్రంబులైనన్ మహాస్త్రంబులైనన్ క్షణంబున్ విలం
బంబు లేకుండ నిర్ఘాతముల్ చేయు రోమంబులున్ రోమ
కూపంబులున్ గల్గు నీమేనికిన్ మించి కేల్మోడ్చెదన్ - నీదు
లాంగూలముంగన్నులం దద్దుకొందున్ - సదాసర్వలోకంబు
లందాల్చు నీకుక్షికిన్ వందనంబిచ్చెదన్ బర్వతంబుల్ దృణ
ప్రాయముల్ జేయు సామర్థ్యమొప్పంగ నాకష్టభారంబుఁ బాపన్
వరంబిచ్చు నీచేతికిన్ మ్రొక్కెదన్ - దివ్యమంత్ర ప్రభా
పూర్ణమైయున్న నీగుండెకుం దండమందున్ - మహాసంప
దుద్యోగముల్ గూర్చు నీమందహాస ప్రభాసుందరం బైన
మోమున్ మదింగొల్చెదన్ - దండ్రి ! వీక్షించినన్ జాలభీష్టా
ర్థముల్ కొల్లలౌనట్లు నిండించు నీసత్కృపావీక్షణంబెంచి
కేల్మోడ్పుగావింతు - నోస్వామి ! నాకుం బ్రసాదింపవే కార్య
సిద్ధుల్ - భవత్పాదపంకేరుహం బెప్పుడున్ నాహృదంతః
ప్రవిష్టంబుగాఁ జల్పి నన్నున్ గృతార్థుం బొనర్పంగదే-స్వామి!
శ్రీజానకీరాములన్ నీహృదంతఃప్రదేశంబునన్ నిల్పుకొన్నావు;
నీవున్నచో బ్రహ్మవిష్ణ్వీశ ముఖ్యామరశ్రేణులున్ గాపురం
బుండు - నోస్వామి! నాకావ్యమందేను నిన్నంకితుంజేసి నీసర్వ
శక్తస్వరూపంబు భావించెదన్- భక్తరక్షైకదక్షా! సురాధ్యక్షా!

దుర్భావమత్తేభ హర్యక్ష ! శ్రీమత్కృపాపూర శింగాక్ష !
శ్రీదానసౌపర్వవృక్షా ! సదాసాదువక్షా ! సదాదుష్టశిక్షా !
కరాగ్రాత్తమోక్షా ! ముఖస్థానబుక్షా ! నికృత్తారికక్షా !
శ్రితాభీష్టదానైకదక్షా ! కపీంద్రా ! హరీ ! రామదూతా !
సదాసాధుగేయా ! అ మే య ప్ర భా వాం జ నే యా !
నమస్తే నమస్తే నమస్తే నమః.

వ. ఇట్లునుతించి ఆంజనేయకృపాపాత్రులై వివాహదర్శనానంద
భాగ్యోపేతులై శ్రీసువర్చలాంజనేయ ప్రతిబింబితహృదయ
ఫలకంబులు బహుమానంబుగాఁ జనిరి. అంతట సువర్చలా
దేవి ఆంజనేయునితో ఏకాంతంబున

ఉ. రామ పవిత్ర నామజప రాజితమైన భవచ్ఛరీరమం
దేమర కేనివాసముగ నెంచి వసించెద-బ్రహ్మచర్య దీ
క్షామహనీయతా విభవ గౌరవలాభము పొందెదన్-నిజ
స్వామిని విస్మరించిన నుమర్భుధవృత్తి బహిర్గమించెదన్.

తే. బ్రహ్మచర్యవ్రతాపార భవ్యదీక్ష
నీయెడన్ వెలయుటఁజేసి విస్మరించి
యుంటి - నంతటి నిష్ఠలేకున్నవాఁడు
నన్ను నర్ధాంగిఁగాఁ గైకొనంగలేఁడు.

తే. బ్రహ్మచర్య మవిఘ్నసత్ఫలదమగుట
కొఱకు నీభార్యనై నిన్నుఁ గొల్వఁగోరు
చుంటి - నైహిక సుఖముపైఁ జూపులేని
దాన; నన్నేలుమా ! జగత్ప్రాణజాత !

( సూత్రధార కథక వాక్యము )

వ. ఇట్లంజనీదేవి ఆంజనేయుని నుతించి తేజోమూర్తియై అభిన్న
ముగ సతనియందు వెలసి శ్రీమన్మారుతిశక్తుఁడయ్యెను.

ఉ. ఆయన సద్వితీయత యథార్థముగా నొక అద్వితీయ భా
వాయతనంబెయైనది – సమర్థసహాయకయై సువర్చలా
జాయ నిజాంతరంగమున సంతత శాంతనిగూఢశక్తియై
పాయక యుండె–మారుతి ప్రభావము శాక్తసమైక్యభవ్యమై

వ. శ్రీమన్మారుతిని సర్వశక్తునిగాఁ గొల్చి సురమునిగణంబులు

సురట – అటతాళము

ప॥ మంగళంబు శ్రీసువర్చలావర ॥
మంగళంబు నీకంజనికుమార

అ॥ప॥ మంగళంబు సర్వలోకశూర ॥
మంగళంబు శ్రీరామజపపరా ॥మం॥

చ॥ మంగళంబు భువనైకపాలక ॥
మంగళం బాంధ్రదేశనివేశక
మంగళంబు సకలాఘనివారక ॥
మధుసూదనగేయకావ్యనాయక ॥మం॥

తే. భువనముల నెల్లెడల శాంతి పొలుపుమీర
మానవులు దైవసంపదన్ మంద్రుగాఁత
ఆయురారోగ్య భాగ్యము లతిశయింప
భారతము శాశ్వతఖ్యాతిఁ బరగుఁగాక !!

ఓం తత్సత్

# స వ ర ణ

| పేజీ | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 1 | 19 | మవరం | మపరం |
| 2 | 1 | కరేఖ | కరేభ |
| 5 | 8 | కవలలై | కవలలు |
| ,, | 17 | మనసునన్ | మనసునన్ |
| 13 | 14 | ప్రమహో | మహో |
| 21 | 1 | దిక్పతుల | దిక్పతులు |
| ,, | 2 | మూల | మూలు |
| 22 | 7 | పడ | పడి |
| 24 | 15 | పగర | పరగ |
| 28 | 11 | స్వామి....మూర్తి ! | స్వామి!....మూర్తి |
| 30 | 14 | ప్రార్థినాం | ప్రార్థితానాం |
| 33 | 11 | యాపరొ | యాపమె |
| 35 | 23 | త్రావోధ్య | త్రాపాధ్య |
| 36 | 14 | వాకాశనే | వికాశనే |
| 37 | 9 | దేవునిఁజేరియు | —న |
| ,, | 15 | మోనమీరణా | మోయి ధాత్రికిఁ |
| 38 | 3 | అఖిల | ఁడఖిల |
| 39 | 21 | కిచకిచనాడు | కిచకిచలనాడు |
| 40 | 18 | విస్తృత | విస్మృత |
| 41 | 8 | ఎవరో | ఎవఁడో |
| 42 | 23 | శిష్యులకు | శిష్యునకు |
| 45 | 5 | స్వరూపుఁడగు | హితుఁడు |
| 46 | 7 | నాకుపుత్రుఁ | నాకుఁబుత్రుఁ |
| 57 | 4 | వాల్మీకి | వాల్మికి |
| 60 | 2 | సాదుపక్షా | సాధుపక్షా |